# అంకితము

శిల్ప, చిత్రకళా కవిత్వములందసమానప్రతిభఁజూపి,
పదునెన్మిదేండ్లుజ్జ్వలతారవలెఁ  బ్రకాశించి
మమ్మువీడి  దివ్యకళావైదుష్యమలవరుచుకో
దివికేగిన  నాచిన్నితమ్ముఁడు

**వేణుకు**

# మనవి

ఈ కావ్యమునందలి యాఖరిఘట్టము—రాణి పురమున వస్త్రహీనయైచనుట—W. S. Landor వ్రాసిన Leofric and Godiva లోనిది. తక్కినదంతయు నేను కల్పించినదే. ఇందు విహారికథలో సహజాతీతశక్తి (Supernatural)ని గల్పించుట వాస్తవికముగ లేదని కొందఱు మిత్రులనిరి.

భక్తి, మూఢనమ్మకముల మాట అటుండ—నిజముగా నటువంటివి సంభవించునను నమ్మకము నాకున్నది కూడ—కథాశిల్పమునకది చాలయవసరమైనది. రజనీప్రియాతోరమానుల నైసర్గిక స్వభావములఁ బరిశీలించిన దానియవసరము స్పష్టమగును. రజనీప్రియ ముగ్ధ; సహజకారుణ్యశీల. ఇచ్చటనే యొక విషయము గమనింపవలెను. ముగ్ధయనగా లౌకికానుభవము తక్కువ యన్నమాటయేగాని, ఆమె ముగ్ధ కనుక సహజముగా కరుణాలవాల యన్నమాటకాదు. కనుక—తన యంతస్తు—పేదఱికము—విడిచి యొక్కసారి గుప్పున మఱియొక క్రొత్తయంతస్తు—రాజ్ఞీత్వము—ను డీకొనగానే మానవసహజమైన యాతురతకులొంగి అంతఃపురభోగముల నూతనానుభవమున కెరయైనది. అది తాత్కాలికము. సహజప్రేమార్ద్రమూర్తియౌట, భో

గాంధతమస్సునుండి యీ మేను, ప్రాణిజ మరణమువంటి ఇహ లౌకికఘట్టమొకటి, మరల్పగలిగినది.

ఇకతోరమానుఁడు: నైసర్గికముగా క్రూరుఁడు. అపార మైన శక్తియున్నది; ధనమున్నది; అధికారమున్నది. ఐహిక ముగా నాతఁడు పొందజాలని దేదియు లేదు. పరపీడన, దుర్జ నత్వము, అతని లీలలు; బాధ, పేదఱికము అతనికి దైనందిన దృశ్యములు. అతని మనస్సు మార్చుటకీ ఐహిక సాధనములలో నేదియు పనికిరాదు. సాధారణముగా నటువంటి అధికార యుతులైన దుర్జనులకు లోకాతీతమగు శక్తులన్నచో నపరిమిత మగు భయముండును. ఒక అదృశ్యమూర్తి మనచర్యలన్నిటిని విమర్శించి శిక్షణరక్షణలు చేయునని అన్నిమతములును ప్రతి వానికిని పిన్ననాఁడే హృదయమున నాటివేయును. ఆ మూర్తి యొక్క శక్తిని ప్రతిమానవుఁడు నంగీకరించును: దుర్జనుఁడు భయపడును; సజ్జనుఁడు కీర్తించును. తోరమానునివంటి సహజ కర్కశహృదయులకు వారిదౌర్జన్య మెక్కుడైనకొలఁది, ఆ అదృశ్యశక్తియన్న భయమెక్కుడౌను; దాని పరిమాణము కొలంది వారాశక్తి లేదని నమ్మ యత్నింతురు. అట్టివారి హృ దయములఁ బరివర్తనఁ దేవలెనన్నచో, ఆ మానవాతీతశక్తికే సాధ్యమగును. కనుకనే మానవులలో సౌజన్యమునకు సీమయని చెప్పఁదగిన రజనీప్రియయు తన త్యాగముచే భర్తను పరివర్తింపఁ జేయలేకపోయినది; ఆ త్యాగముచే సంపాదితమై, అజ్ఞాత

ముగా ఆమెలోనణఁగియున్న ఆ యతీతశక్తి చేయకలిగినది. త్యాగ మాహాత్మ్యమట్టిది.

ఈ కావ్యమునఁజిన్నచిన్న దోషములందందు తగులవచ్చును. వానినిసైచి ఈకావ్యము నాదరింతురుగావుతమని పండితలోకమును బ్రార్థించుచున్నాను.

నాయందలి వాత్సల్యముచే శ్రమయనక, కావ్యమాతృకను జదివి, ప్రవేశకము వ్రాసియిచ్చిన నాగురువర్యులు, పూజ్యపాదులు శ్రీదివాకర్ల వేంకటావధాని ఎం. ఏ. (ఆనర్సు) గారి కెల్లప్పుడును గృతజ్ఞుఁడను.

విధేయుఁడు

యలమంచిలి
12-2-1944

గుంటూరు సత్యనారాయణ

---

# ప్రవేశకము

చిరంజీవి గుంటూరు సత్యనారాయణ ఇంటరుమీడియటు మాకళాశాలలోఁ జదివినాఁడు. తరువాత నాంగ్లభాష ప్రధాన విషయముగా ఎం. ఏ. పరీక్షకుఁ జదివి కృతార్థుఁడైనాఁడు. మాకళాశాలలోఁ జదువుచున్నప్పుడే యీతనియం దిప్పటి యీ కవిత్వమునకు బీజములైన గుణవిశేషములు గుర్తించి నేనానందించెడి వాఁడను. చదువువిషయముననేకాక నాటకములలోఁ గొన్నికొన్నిపాత్రలను సమర్థతతో నభినయించుటయందును, విమర్శనకు హాస్యరసమును జోడించి యాకర్షకముగాఁ బ్రసంగించుటయందును, ఈతఁడారితేరియుండెను. ఆ చుఱుకుఁదనము, ఆ సూక్ష్మగ్రాహిత యీకావ్యరూపమున ఫలించినందుకు నేనేకాక నాతోడియుపన్యాసకులందఱును సంతోషించుచున్నారు.

ఈకాలమున నితరవస్తువులమాట యెటులున్నఁ గవులకును గావ్యములకును గొఱంతలేదు. కాని, ఆకవులలోఁ బ్రతిభా పాండిత్యములును, ఆ కావ్యములలో రసానందజనకమై, హృదయమున కూఱట కలిగించు నున్నత భావములును మృగ్యములు. తాము శాశ్వతముగా గవులై యుండవలయునను వాంఛయే

కాని, తమ కావ్యములు శాశ్వతములై యాచంద్రార్కముగా దమకీర్తిని బ్రోదిసేయవలెనను నాశయమును, దదనుగుణమైన యత్నమును వారిలోఁగానరావు. అందుచేతనే పూర్వకవుల కావ్యరత్నములు సానలుతీఱినకొలంది మిఱుచు మెఱుంగులీనుచుఁగన్నులకుమిఱుమిట్లు గొల్పుచుండ, నిప్పటివి సానకెక్కుటయే తడవుగా భిన్నభిన్నములై రూపుమాసిపోవు చున్నవి. అట్లని, శోచనీయమైన యిట్టిస్థితి కతీతములై, మహోజ్జ్వలభావములతోనలరారు కావ్యములుకొన్ని యిప్పుడును లేకపోలేదు. అట్టివానిలో నీ "రజనీప్రియ"యు నొకటి కాఁగలదు.

చరిత్రలో సువర్ణయుగమని పేరువడసిన గుప్తయుగము సముజ్జ్వలదీప్తులతో వెలింగియాఱిపోయిన పిమ్మట, నా మహారాజ్యమును హూణులు ధూమమువలె నాక్రమించిరి. వారిలోఁ దోరమానుఁ డగ్రేసరుఁడు. హిందువుల శిల్పవిజ్ఞానమణికనకసంపదలును, అభిమానసంపదయు నాతనిక్రూరత కగ్గమై నష్టప్రాయమైపోయెను. రాజత్వమనఁ బ్రకృతుల దండించి, భీతిగొల్పి తనకును దనయానతులకును విధేయులఁగా నొనర్చుటయే కాని, హృదయమునందలి కృపారసమును గ్రుమ్మరించి, తమంతతాము భక్తిమై వినతులగు ప్రజలఁ బాలించుట యోగ్యత యని యెఱుంగఁజాలని యాక్రూరుని యంధకారబంధురమైన హృదయమున దివ్యకరుణాజ్యోతిని వెలిఁగించి, యాతనికిని,

దత్పాలితులైన ప్రజలకును మోక్షపథముఁజూపిన వ్యక్తి రజనీప్రియ. ఆత్మశీలప్రభావముచే శిలాకఠినమైన యాహ్వాణుని చిత్తమును కుసుమసుకుమారముంగావించి, "స్వభావోదురతిక్రమ" యను నానుడికన్యథాత్వము కల్పించిన ధీరురాలామె. ఆమె విచిత్రచరిత్ర మీచిన్నకావ్యమున రమణీయముగా వర్ణింపఁబడినది.

రజనీప్రియ చిన్నతనముననే తల్లిఁగోల్పోయినది. వృద్ధుఁడైన యొక బౌద్ధసన్యాసి యామెను బెంచిపెద్దఁగావించెను. సంప్రాప్తయౌవనయై భిక్షాటనమునకేగు తండ్రికైఁగొని ముందు నడచు నాకన్నెసౌరు తోరమానుని చిత్తమును మదనానలతప్తముంగావించినది. ధర్మాధర్మవిచక్షణయెఱుంగని యామెఱకు, బల్మిమై, "సిగపూవసివాడకుండ" నామెనుగొని రమ్మని సేనలఁబంపినాడు. (అపారమైన క్రౌర్యములో మెఱుపువలె మెఱసిన యాకరుణ దానికి మఱింతయుత్కర్ష నాపాదించినది). సేనానాయకుఁడు, కేఁడు ముదలయిచ్చుటయే తడవుగా నాపవచ్చిన ముసలిసన్యాసి సంప్రార్థనలు పెడచెవింబెట్టి యాతనిమీఁదనుండియే యరదమును దోలుకొని రజనీప్రియనుదెచ్చి యంతఃపురమునముంచెను. రజనీప్రియ తోరమానుని "నీచంపుటుద్యమభావ"మును గనిపెట్టి బహువిధముల నివారింపఁజూచెను. కామాంధుఁడైన యాక్రూరుఁ డాయుపదేశములపాటిచేయక, బలవంతముగఁ దనకోరిక తీర్చుకొనెను.

రజనీప్రియ తనశీలముభగ్నమౌటకుకంటె, మందభాగ్యుఁడైన హూణచక్రవర్తి "హృదయరత్నమును జార్చి" వేయుటకు మిక్కిలి చింతించెను. "తనువు చిక్కినపేదల"కనయమును సేవచేయనెంచిన యాకరుణార్ద్రమూర్తి "మనసు మాలిన్య మందిన ధనయుతు"నికే సేవచేసి యాతని హృదయమునఁ బరివర్తనము కల్గించి ధన్యజీవ యౌటకు నిశ్చయించెను. ఈ సంకల్పము నామె నడుమ కొంత విస్మరించినను, దుదకుఁబూర్తిగా నెఱవేర్పఁజాలెను. తన శీలమును సైతము చిచ్చుపాల్సేసి, పరసేవాపరతంత్రహృదయయై యామె చరితార్థతఁగాంచెను. ధరిద్రులకుఁజేయవలయుసేవ బాహిరమైనది; మఱి ధనికులకుఁ జేయవలసినదో, యాంతరమౌటచేఁ గష్టసాధ్యమైనది. రజనీప్రియ యాసేవచేయుటలో మిక్కిలి నైపుణ్యముఁజూపి, తద్ద్వారా తాఁజేయఁదలంచిన దీనానాధసేవనుగూడఁ గొంతకుఁ గొంత యాచరింపఁజాలెను.

రజనీప్రియ రాణియై యా భోగసౌఖ్యములలోఁ గించిత్కాలము తన శీలభంగము, తండ్రిమరణము, దీనసేవ విస్మరించెను. ఇంతలో హూణభటుల బాధలు సైఁపలేక విలపించుచున్న పాణిజ యేడ్పుటెలుంగామెకు వినిపించెను. ఆయెలుంగెంత మహిమకలదో—విస్మృతమైన సర్వమును మరల నామెస్మృతి పథమున సాక్షాత్కరింపఁజేసెను. మున్నొకనాఁడు, తానాఁ కటిచే సొమ్మసిల్లిపడిపోవఁ బసినిసుంగులకై యుంచుకొన్న

పాలను దనకోసంగి ప్రాణములు నిల్పిన త్యాగమూర్తి యావిల పించు పాణిజ. ఆ మహాత్యాగవిద్యుత్కాంతిలో రజనీప్రియకుఁ దన హీనచరిత్రము పరిపరివిధముల గోచరించి పశ్చాత్తాపము కలిగించెను. ఆమె, పాణిజను విడిచిపుచ్చి, సేవకులకానతి యొసంగెను. కాని యాయానతి యాహీనుల వీనులుసోకుటకు మున్నె, చీకుముసలిసన్యాసిపైనుండివలెనే యరదము పాణిజ పైనుండి దాఁటిపోయెను. "ఆనాఁడంతయు : 'తల్లిదండ్రుల టు బాల్యంబాదినినోఁ్నము మాప్రాణంబుల్ గొని యెట్లుహాయిగ ధరన్ బాలింతువే?' " యంచుఁబ్రచ్ఛించుచు, నానావికార హాసములతో మూర్ధములు నల్దిక్కుల గోచరించి రజనీప్రియకుఁ బూర్వప్రజ్ఞలను స్మృతికిఁదెచ్చెను. ఆ యనుభవముతో రాణి యైన రజనీప్రియ మరల ముసలిసన్యాసిచేఁ బెంపఁబడిన ముద్దరాలయ్యెను.

తోరమానునిచే బంధితులై పలుపాట్లు పడుచున్న దీనులను జూచి, వారి యిడుమలుకడతేర్చుటకై, రజనీప్రియ, "ధరణి పైఁదేఁడుకట్టిన నరకము"ని చెప్పఁదగిన కారాగారమున కేగెను. ఆమె బందీకృతులఁజూచుచు, రక్షకుల లేనిపోనిమాటలు వినుచుండ, పిచ్చిదియైన సునంద యామెను జేరి, "సంపదల్ వలచి యమ్ముడు పోతివె రాణివైనరండా!" యని గేలిచే యుచు నామె మోమున నుమిసెను. పాణిజపరివేదనచే సగము మళ్లినరాణి పూర్తిగా మాఱిపోయెను. ఆమె, భటులందఱు

నచ్చెరువంద, సునంద కేమియు హానిజరుగరాదని యానతియొసంగి, యామె దీనచరిత్రమునంతను విని, యామెనంతిపురికిఁ గొనిపోవ నాజ్ఞయొసంగెను. ఈసునందశీలము నిరుపమానమైనది. ఆమె తన శీలరక్షణమునకై ప్రాణమునకు ప్రాణములైన బిడ్డలను, భర్తనుబలియొసంగిన ధీరురాలు. ఈమె చరిత్రము రజనీప్రియ చరిత్రమునకు విచిత్రమైన ప్రతియోగమై (contrast), యామె హృదయాకాశమున విషాదమేఘ పరంపరలను వ్యాపింపఁజేసెను. రజనీప్రియకు స్వీయమైన యపరాధమెటు చూచిననఱే పొడగట్టెను. ఆ యపరాధజ్వాలలఁ జల్లార్చుకొనుటకై యామె సుధాపాథోధరుడైన బుద్ధభగవాను నాశ్రయింపఁబోయెను. రజనీప్రియ మనఃపరిణామమునకు హేతువైన యమోఘమహిమకుఁ దావల మీయపూర్వఘట్టమే!

నాఁటిరాత్రి రజనీప్రియ కంటికిఁగూర్కు లేక, త్యాగమూర్తియైన బుద్ధభగవానునే తలంచుకొని శయనించెను. తెల్లవారుజామున నామహనీయుఁడామెకు స్వప్నమునఁ గానిపించి, తనవలె, నెందఱో జగమున నవతరించి, "యార్తావనదీక్షఁ బ్రాణములనర్పణఁజేసినఁగాని మానవుల్ లేవఁగలే"రనియు, మఱి నాఁడామె యొక కష్టతరమైన పరీక్షకు నిల్చినచోఁ దన సంకల్పమును దుదముట్టించి జయింపఁగలదనియుఁదెల్పి, త్యాగమున కంతకుమున్నె కృతనిశ్చయయైన యామె కావిషయమున మఱింతయభినివేశము కల్పించెను. బుద్ధభగవానుని యుపదే

శముచేతను, బశ్చాత్తాపముచేతను బ్రక్షాళితమై, యమలినీ కృతమైన రజనీప్రియ యెడందకుఁ, గ్రూరుఁడైన హూణుని సైతము తన పాదమునకు లొంగఁదీయు దార్ఢ్యముచేకూఱెను.

తోరమానుఁడు, తనరాణి యరదములేకయే కారాగృహమునకేగి యొక పిచ్చిదాని నంతిపురికిఁ గొనివచ్చెనను వార్త వినెను. "పేదల ప్రాణమానములఁబీల్చి యహమ్మునవీగు"చు, "రథమ్ములెక్కి పురమందు చెలంగు"టయే రాచమర్యాద యని విశ్వసించిన యాదురహంకారి కది చిన్నతనమనిపించెను. పేదలరక్షించుటయను స్వల్పకార్యమునకై, రాచమర్యాద లెఱుంగని బీదకన్నె తన మరియాదఁ గంగఁగలిపెనని యాతఁడు భావించెను. పేదల రక్షణమే పృథివీపతి ధర్మమను నాశయ మాతని హృదయమున దవ్వుదవ్వులనైనఁ బొడగట్టఁజాల దాయె. అట్టి నిర్దయునకు రజనీప్రియ మహితమైన రాజధర్మముయొక్క దివ్యత్వమును బ్రదర్శింపఁబూనెను. "శాంత మొప్ప నసినేనియుఁదాల్పని" యశోకు నాతనికి దృష్టాంతముగాఁ జూపెను. కరుణా శాంత వినయాది దరిద్రసామాన్యగుణములే నరపాలురకలంకారములౌననియు, సిరులువట్టి గర్వకారణములనియు నామె యాతనికి బోధించెను.

రాజత్వమునెడను, బ్రజారంజనము నెడను రజనీప్రియా తోరమానుల దృక్పథములే వేరు. ఆవిషయమున నొకరి దుత్తర ధ్రువము, మఱొకరిది దక్షిణధ్రువము. "ఖడ్గమ్ములేక

రిపుల్ చత్తురె? వేడుకొన్న జనులాకర్ణింతురే?" యనియు, "వేదాంతులపాలిభూమి పరహస్తగతమ్మగుపుస్తక" మ్మని యు, రాజ్యతంత్రమును, నీతియు నెన్నఁడు నొక్కయొరఁ బట్ట వనియుఁ గ్రూరుఁడైన తోరమానుని వాదము. ఇట్టి వాద ములోఁ దోరమానుని కనుగాములైన వింతరాజనీతివేత్తలు ప్రతియుగమునందును గలరుగదా! "సజ్జనులఁ గరాసికిన్ బలి నొసంగు"టయే రాజధర్మమని సంబరపడుట ఆత్మవంచనయని యుఁ, "గత్తియె రాజ్యపాలనకుఁ గాఁగలసాధన మంచునమ్మి క్రొన్నెత్తురు ద్రావుక్రూరుఁడు" రాక్షసుఁడేకాని రాజు కాఁడనియు, నట్టివానికిఁ బరలోకముననగు శిక్షలను దండ ధరుఁడుసైత మెఱుంగఁ జాలఁడనియు, రజనీప్రియవాదము. నయమునఁ గాలకూటమైనఁ ద్రాగువారు భయమునఁ బాల సైనఁ గ్రోలనట్లు "శాంతవిధి వేలొసంగెడి జనులుగూడ, ఖడ్గ మునుజూప నిడరొకకాసుప"న్నని యామె తేనియొదుట ముక్తకంఠముతో ఘోషించెను. కాని రోగికిఁబథ్యాహారము రుచింపనట్లు దురహంకారప్రేరితుఁడైన తోరమానునికా బోధలు రుచింపకపోవుటయే కాక కోపమునుగూడఁగలిగించెను.

సౌందర్యనిధానమైన రజనీప్రియ తనకు రాణియై తన్నుఁ బ్రణయసుధారసమున నోలలార్చుననియే యాతఁడు భావించెను గాని, తన మనస్సునకు విపరీతములైన వాదములను దండోప తండముగా వర్షించి, తన కప్రియము కలిగించునని యాతఁ

డెన్నఁడును భావింపలేదు. తనయాత్మ ప్రణయవేదనచే నుడు కెత్తిపోవుచుండఁ దియ్యమైన నెయ్యమును గ్రుమ్మరింపక, రజనీప్రియ, తన్ను మఱింత వేధించుట యయుక్తమని యాతఁడామెను బ్రార్థించెను. కాని, "ఒక్కవ్యక్తిపై నెసఁగెడు ప్రేమ, సంకుచితదృక్పథమందు నశించు కామమై, వసుధ సమస్త జీవతతిపైఁ బ్రసరించెడి జ్యోతిగానిచో" నని యామె యాతని ప్రార్థనల ధిక్కరించెను. భూమిపైజనించి మానవులొనరించెడి సత్కార్యములనేకాని, వారి సంపద్వైభవములను బరమేశ్వరుఁడొక్కింతయుఁ బరికింపఁడు కావున దేవుని చిత్తమును మెప్పించువిధముగాఁ బ్రజారంజనము కావింపుమని యామె యాతనిపాదములు పరిగ్రహించెను. నిష్కరుణుఁడైన యాహూణుఁడు "బుద్ధదేవుపదయుగ్మరజఃపరిపూతమైన తచ్ఛిరము" నవివేకియైతన్నివైచెను. తన్నంధతమస్సునుండి లేవనెత్తుటకై రజనీప్రియ యొసంగిన సదుపదేశమునకై యాతఁడొనర్చిన ప్రత్యుపకారమది!

తిరిపెమెత్తుకొనుచు వీధులవెంటఁదిరుగు బికారిబాలికనంతఃపురమునకుఁ జేర్చినంతమాత్రమున నామె మానసమున కౌన్నత్య మెట్లుచేకూరునని తోరమానుఁడు తలంచెను. ఆమె మాటిమాటికిని దనకు బోధించు త్యాగమామెయందేమాత్రము కలదో చూతమని యాతఁడామె నొక్కపరీక్షకు గుఱిచేసెను: "వస్త్రహీనవై పురమునఁ దిర్గుచో విడిచిపుత్తును సుంకములెల్ల" నని

ప్రతినవట్టెను. అనాధులైన ప్రజలకు బాధావిముక్తి కలిగించుట యను మహోత్తమకార్యమునకై యామె తన మానమును బలియొసంగ నిశ్చయించెను. రజనీప్రియ త్యాగగుణమున కిదియే పరాకాష్ఠ. ఈ మహోత్తమత్యాగగుణమే క్రూరుఁడైన తోరమానుని దారుణహృదయమును గరగించెను. బుద్ధదేవుఁడు తన్ను రక్షింపకపోఁడను గాఢనిశ్చయముతో రజనీప్రియ తన దీక్షను బురమునఁ జాటఁబంపెను.

మహారాణి విన్నపములో ధ్వనించిన నిరుపమానమైన త్యాగ వార్తవినఁగానే ప్రజలు పరిపరివిధముల వాపోయిరి. ఆమె మానమునెట్లైన నాఁడు రక్షింపవలెనని, వారు సర్వమంగళను గూర్చి పూజాప్రార్థన లొనరించిరి. అనాధులైన తమకోసమై, మహారాణిచేయు సాహసికమైన మహాత్యాగము వారి హృదయ నాళముల నుప్పొంగఁజేసెను. ఆమె తమకొనరించు మహోప కారమునకు, దీనులైన వారుచేయఁగల ప్రత్యుపకారము, పర మేశ్వరిని బ్రార్థించుటతక్క మఱేమికలదు? పురమునందలి జనులు తననిమిత్తమై యావిధముగఁ బొక్కుచుండ, నాఁటి రాత్రి రాణి సర్వభారమును బుద్ధదేవునిపైపైచి, యందుఁ దన కేమియు సంబంధము లేనట్లు నిద్రించెను. తోరమానునిగుండెలో నిర్హేతుకముగ భయంకరవేదనానలజ్వాలలు ప్రజ్వలించెను.

ప్రభాతము కాఁగానే రాణి పరీక్ష కాయత్తురాలై యరద ము సిద్ధముచేయ నొక పరిచారికం బంచి, తాను బుద్ధదేవుని సన్నిధి

కేగి, తన్నుc, దనభర్తను, బ్రజలను గాపాడుమని ప్రార్థించెను. బయటనున్న రథసారథి మనస్సులో విచిత్రమైన పరిణామము జరిగెను. ఆతcడును బ్రకృతులలో నొక్కcడు గదా! అర దముపై రాణి నిరంబరయై కూర్చుండcదాను నిష్కారుణుcడై రథముc గడపవలెనుగదా యని యాతనిబాధ. బాధపడుచు నైన యాతcడాకార్యమును నిర్వర్తింపవలసినదే. రాణి యెడను, నామెత్యాగమునెడను దనకుcగల భక్తి జాలువార నాతcడామె పాదములపైc బడి రథము నడచునప్పుడు తాను మెడనైన వెనుకకుc ద్రిప్పననియు, నప్పుడాపని తాను జేయవలసి వచ్చినందుకు క్షమింపవలెననియుc బ్రార్థించెను. రాణి యాతని మనోవేదన గ్రహించెను. స్వధర్మనిర్వహణమునం దాతని కుత్సాహముకలిగించి, యామె యాతనికూఊట కలిగించెను. త్యాగమెంత శక్తికలది! అది పామరులను, గ్రూరులను సైతము కరుణార్ద్రచిత్తులంజేసి, తనకు దాసులcగానొనర్చుకొనcజాలును.

రాణి పుట్టమువీడి రథము చేరcగ వచ్చినవేళ బుద్ధముని నేత్ర పద్మములం దశ్రుమరందము పొంగులువారెనcట! ఆ త్యాగ మూర్తి యార్తరక్షాదక్షత యట్టిది. లోకములనన్నింటిని గర్గో లానరించుటకా కరుణార్ద్రమూర్తి కన్నీటి బొట్టొక్కటి చాలదా?

రాణిరథము వీధులcదిరుగువేళ పౌరులలో నొక్కరును బైటి కిరాలేదు. కాని "విసపుతలంపులుజా పయికి వెన్నెల

లాలెక్కాడు లేఁతనవ్వులుఁజ" గల విహారినామకుఁడైన ముసలి వజీరు, కట్టుఁబుట్టములేని మహారాణి యాకృతిని నిరీక్షించు పాపంపుఁగోరికతోఁ దలుపునోరగఁదెఱచి యొడలెల్లఁగన్నులై చూచుచుండెను. తేరిచప్పుడు వీనులఁజొరఁగానే దివ్యతేజస్సొందు రథమునుండి వెలువడివచ్చి, యాతని దుష్టనేత్రముల నంధములఁగావించెను. మహారాణి త్యాగమహిమ గుర్తింపలేక యాదుష్టుఁడు తన దృష్టిని దానికి బలికావింపవలసివచ్చెను. ఇచ్చట రజనీప్రియ దివ్యరాలైనది. అతిలోకమైన యామె మాహాత్మ్యము సర్వలోకవిదితమై పోయెను. త్యాగమహాపాదపమునఁబుట్టి ఫలమైనదే యీ మహాత్మ్యమామెకు.

విహారి వెంటనే తోరమానునికడ కేగి, రాణిమహత్త్వమును వేయివిధముల వక్కాణించెను. తన దౌర్మార్గ్యమును వివరించి, తత్ఫలమును దానికి దృష్టాంతముగాఁజూపెను. రాజు నివ్వెరపడి యాత్యాగమూర్తి శరణువేఁడుటకై బయలుదేరెను. అతఁడు శరణమ్మని తన పట్టపుదేవి పాదములఁ బడువేళ బుద్ధముని మోమున మందహాసమరీచులు ముత్యాలపేరులగ్రుమ్మరించినవఁట! భక్తజనుల విజయమే లోకకుటుంబుఁడైన యీ మహామహుని వేడుక. లోకము శాంతమై, సౌఖ్యముంబొందుటయే యా పరమకారుణికుని యానందము.

రాజు తనతప్పిదము నొప్పుకొనెను. రాణియు నాతనిపై క్షమాసూచకములైన కటాక్షవీక్షణములఁ బరఁగించి లేవ

నెత్తెను. బుద్ధముని భక్తురాలైన రజనీప్రియ కృపచేఁ గ్రూరుఁ డైన తోరమానుఁడు కారుణికోత్తముండయ్యెను. ఈ పరిణామ మునకంతకును మూలభూతమైన రజనీప్రియా బుద్ధదేవుల త్యాగ శక్తికి ధన్యవాదములు.

కవి వయసునఁ బిన్నయయ్యు, రచనలోఁ బెక్కువిధములఁ గృతహస్తతం బ్రకటించినాఁడు. శైలి సర్వత్ర ధారాళమై, పేశలరమణీయమై, యతిమనోజ్ఞముగానున్నది. ఉపమానము లున్నచోట్లనెల్ల నౌచిత్యమునకుఁ దావలములై, దృశ్యమును సాక్షాత్కరింపఁ జేయుచున్నవి. వృద్ధముని యోగదీక్షాయుతుఁ డయ్యు, రక్తుఁడై రజనీప్రియను, శకుంతలను గణ్వుపెంపున, సాకినాఁడు. హుణభటులు

"సాంధ్యరాగారుణప్రభా జాలదీప్త
మై తనర్చెడి తెలిమబ్బు రీతి, పర్ణ
శాల ముంగిటఁ గావివస్త్రాలు కట్టి,
తపసునొనరించు హిమశైల తనయఁబోలి
యున్న మునిసుతఁ . . . . . . "

(ఆ. 1. ప. 13)

గాంచిరి. ఇట్టియుచితోపమానములు గ్రంథమునఁ నెన్నోకలవు. ప్రథమాశ్వాసమునందలి 7, 9 పద్యములలోఁ బింగళిసూరన్న రచన యూఁడిపడుచున్నది.

" . . . . . . వృద్ధు శిరమ్ముపై క్షణికనాట్యోల్లాసముఁ
జూపి, దాఁటెరథాంగంబులు, దాఁటె నశ్వములు,
దాటెఁ హయాణవర్గంబులుఁ" (ఆ. 1. ప. 18)

అనుపద్యమునఁ గ్రూరమైన యీ రథవేగము కన్నులకు దుర్ని రీక్ష్యమై కానిపించుచున్నది. ప్రతి పద్యమునందును భావ వ్యక్తి స్పష్టమును, శక్తిమంతమునై యున్నది (ప్రథమాశ్వా సము, ప. 36). కరుణరసము పెక్కుఘట్టములందు వెల్లువలై ప్రవహించినది. బుద్ధభగవానునిగూర్చిన స్తోత్రము లన్నియు భక్తిరసఘుటికలు.

ఇంకఁ గావ్యమునందలి ప్రకృతివర్ణనలంగూర్చి యొక్క మాటచెప్పి విరమించెదను. దినముఖావసానముల సూచించు రమ్యములైన వర్ణనలు గ్రంథమునం దవసరస్థలములం దేకద్వి పద్య పరిమితములై కాన వచ్చుచున్నవి.

" పశ్చిమాంబుధి భానుండు వ్రాలె—నంతఁ—
బాపకల్మష చిత్తసం భరిత జగతిఁ
ద్యాగమూర్తులు నా—తమో రాగ నిబిడ
మైన దివివెల్గెఁదారక లచ్చటచట" (ఆ. 4. ప. 10)

ఈ వర్ణనయందలి యుత్ప్రేక్ష సజీవమై, పాపపంకిలమైన యీ లోకమున నవతరించిన రజనీప్రియా శౌద్ధోదనులవంటి త్యాగ మూర్తులను బ్రత్యక్షము చేయుచున్నది. ఈ యాశ్వాసము

నందలి 24 వ పద్యము, మనుచరిత్రమునందలి "తరుణీననన్య కాం" తేత్యాది పద్యమునందలి సౌందర్యమును వెక్కిరించు చున్నది.

"ధర్మ సంస్థాపనార్థమా-త్యాగమూర్తి
యంబరంబులు లేక నేఁ-డరుగు నంచు
కన్నువిప్పఁగ లేదంట-కలువకన్నె
రాజపథపార్శ్వ సంస్థిత-రమ్యసరసి." (ఆ. 4. ప. 26)

ఇందలి యౌచిత్యరామణీయకములనన్యసామాన్యములుగా నున్నవి. కలువకన్నె ప్రాతఃకాలమునఁ గన్నువిప్పమి ప్రకృతిసిద్ధమేయయ్యు నిందు గంభీరార్థమును ధ్వనింపఁజేయు చున్నది. ప్రకృతివర్ణనలన్నియు నీరీతిగా నుచితస్థలములలోఁ జేయఁబడి, కావ్యమున కింతయనరాని వన్నె చేకూర్చుచున్నవి.

కవి తోరమానుని క్రూరతను, మనఃపరిణామమును, సహజముగా నిరూపించినాఁడు. రజనీప్రియకు ద్వితీయాశ్వాసములోఁ గలిగించిన విస్మృతి స్వల్పకాలపరిమితమయ్యు, నామె మనస్సు నపరిమితముగా బాధించినది. అంతఃపురభోగముల యాకర్షణశక్తిని ప్రదర్శించుటకై యాతఁడట్టిస్థితిని వర్ణించి యుండును. కవి యీ గ్రంథముగాక యిదివరకే "తిమ్మరుసు" మున్నగాఁ గల గ్రంథములుకొన్ని రచించినాఁడు. ఇఁకముందు సైతము, మనోహరములై, కళాసంపన్నములైన

కావ్యములురచించి, తన కవితాపాటవమును ప్రదర్శించుట కనువగు నారోగ్యమును, ప్రతిభను భగవంతుఁడీతనికిఁ బ్రసాదించుఁగాక !

ఇట్లు,

దివాకర్ల వేంకటావధాని ఎం. ఏ. (ఆనర్సు)

మిసెస్ ఎ. వి. ఎన్. కళాశాల,

విశాఖపట్టణము

12-2-1944

---

# శ ప థ ము

గుప్తరాజ్యంపుటంతిమ దీప్తులడచి
హూణసైనిక నివహంపుటుగ్రశక్తి
దేశమెల్లెడ నిండిన దినములవ్వి
కాలగర్భాననిద్రించు కట్టుకథలు. ౧

* * *

గుప్తవీరులధైర్యంబు కొల్లగొట్టి
ఱేని శిరమును గ్రుచ్చి ఖడ్గాననెత్తి
విజయఘోషణ ముప్పొంగ వీడుచొచ్చి
హూణనాయకుఁడౌ తోరమానుఁడపుడు. ౨

బాలుర, స్త్రీల, వృద్ధుల న
  వారితవృత్తి వధించి ; అంతి సౌ
ధాలగమించి, పట్టుపర
  దాల తెరల్చి ; అమేయ చిత్రదే

వాలయశిల్పవైభవము
　　లారిచి ; ఆ రుధిరస్రవంతిలో
నేలెను తోరమానుఁడు ప
　　దేడు దినాలు నిరంకుశంబుగన్. 3

నవశిల్ప చాతురుల్ తవణిల్లు సౌంపైన
　　కట్టడాలను నేలమట్టుచేసి ;
సాహిత్యసత్కళా సంపత్ప్రభలఁజాటు
　　భాండారములనెల్ల మండఁబెట్టి ;
శాంతదయాగుణ సాగరులౌ యోగ
　　వీరుల వాసముల్ బీడొనర్చి ;
రత్నమాణిక్యంపు రాసులన్ కొల్లగొట్టి
　　భటనివహాలకు పంచిపెట్టి ;
నాల్గువందల వర్షాలనాఁటి విభవ
మేడు దినముల పాపమం దింకిపోవ
వీడు నల్వంకలను వల్లకాడొనర్చె
వక్రపథవర్తియాహుణ చక్రవర్తి. ౪

ఆపురవీథులన్ దిరుగు
  నంధుడు బౌద్ధయతీశ్వరుండు, దా
దాపుగ తొంబదేండ్లు తల
  దాల్చిన వృద్ధుడొకండు భిక్షుకై
యోపికతోడ సాగి జను
  నోగిరముల్ గొని పర్ణశాలకున్
దీపిక వోలె నొక్క రమ
  ణీమణి కైగొని త్రోవఁజూపఁగన్. ౫

ఆ యతివర్యు వెంటఁజను
  నంగన పిన్నతనానఁ దల్లిఁగో
ల్పోయిన దౌట, బౌద్ధముని
  పుంగవుడామెను చేరఁదీసి, నున్
దీయని మోముజూచి "రజ
  నీప్రియ" పేరునొసంగి, యోగదీ
క్షాయుతుఁడయ్యు సక్తుఁడయి
  సాకె శకుంతలఁగణ్వు పెంపునన్. ౬

ఆ రజనీప్రియాకుసుమ
  యౌవనసౌరభ భారవీచికా
ప్రేరిత మోహనీరద మ
  భీష్టతమిస్రము గ్రమ్మలేక, వే
మారు శలాక లౌచు తెలి
  మబ్బు విధంబునఁదూలిపోవు కా
మార మనోనభమ్ముల న
  మందవినోదతుషార మొల్కుచున్. ౮

కొండకోనలఁగుల్కి గునగున చరియల
  తూలెడి సెలయేటి జోలపాట;
యామినీకుంతలసీమలందాడెడి
  ముద్దు చుక్కల దాగుమూఁతలాట;
జ్యోత్స్నాతరంగంబు లుయ్యాలలూపించి
  పరచు దవ్వుల రైతుపాఁతపాట;
గత జన్మవృత్తాలు స్మృతికి వచ్చెడువేళ
  బుడుతతల్లికిఁ జెప్పు ముద్దుమాట;

ఇంద్రియాలకు లోఁగాక హృదయసీమ
లందు మొలకెత్తి, మధురభావార్ద్రమాచు,
మొగ్గలన్‌దొడ్గి, వికసించి పుష్పసార
భమ్ము దెసలను జల్లునా భామసారు. ౮

ఆ వదనారవిందమధు
వానగఁ జేరెడు యౌవనంపు భృం
గావళి, నైజసద్గుణహి
మాంబుపరీతపరాగమందు పోఁ
ద్రోవలు లేక, వెన్దిరుగ
రోసి, అలభ్యమరందమాధురుల్
భావనచేయు దవ్వుల న
భంగరఝుంఝుమగానమాధురిన్. ౯

పురవీధుల నంధుని ముది
కరమున్ గీలించి, మాధుకరవృత్తిన్ వే
దిరిగెడి రజనీప్రియుఁ గని
స్మరుశిఖలన్‌దూలి తోర-మానుఁడు తోడన్. ౧౦

అరదము ద్రిప్పి, కోటమొగ
మై, తన పండితవర్యుఁజేరి, “ ఓ
గురువర ! పీట నొక్కనవ
కోమలచారుతరాంగిఁగంటి, న
త్తరుణి వివాహమాడు, శుభ
దాయకమైన ముహూర్తముంపు ” మం
చురుము, పురోహితుండు తల
యూచెను వాని మతంబదెట్టిదో ! ౧౧

“ చెఱగొని తెందు చారుసర
సీరుహలోచన నంధువెంట నీ
పురి తిరుగాడు దాని ! సిగ
పూ వసివాడగ రా ” దటంచు హే
చ్చరిక నొనర్చి పంపెఁ బలు
సారు లదెచ్చటి సానుభూతియో
అఱువది మంది యాశ్రితుల
నా అసహాయుల పర్ణశాలకున్. ౧౨

సాంధ్యరాగారుణప్రభాజాలదీప్త
మై తనర్చెడి తెలిమబ్బు రీతి పర్ణ
శాల ముంగిటఁ గావివస్త్రాలు కట్టి,
తపసు నొనరించు హిమశైలతనయఁబోలి
యున్నమునిసుతఁగాంచిరా హూణభటులు. ౧౩

ఆయతనంబు డగ్గరెడి
ఆశ్వికులన్ గని ఆమె లోనికిన్
పో యతనంబొనర్చుట చ
మూపతి కన్గొని, దూకి, అంగనన్
డాయఁగఁబట్టి, యెత్తి, శక
టమ్మున వైచెడిలోన నామె, "తం
డ్రీ!" యని ఆర్చి మూర్ఛవడి
యెన్ ; యతియున్ జనుదెంచె గ్రక్కునన్. ౧౪

సవ్వడిన్ బట్టి మెల్లన సంయమీంద్రుఁ
డాదశాధిపుని రథహయమ్ము డాసి,
కళ్లెమున్ బట్టి, లొట్టలౌ కనులనుండి
అశ్రువుల్ జారఁ బోసాగె నరదమంటి. ౧౫

"ఏ మపచారమున్ సలిపి
రీ నిరుపేదలు మీకు తండ్రులా
రా! ముదివగ్గు నయ్యొ! అన
హాయుఁడ! నంధుడ! లేమయాపె! మా
పై మిముబోటిశూరు లిటు
పైకొన ధర్మము గాదు, పీడుఁ" డం
చా ముని వేడ సాగె శిల
లార్ద్రములై కరుణన్ ద్రవింపఁగన్. ౧౬

"'పాపము!' వృద్ధునింత దుర
వస్థకుఁ దెచ్చిన హూణరాజు కీ
పాపమె పండె, కట్టె, కుడు
పంజనదా!" యని, యుస్సురంచు, సం
తాపము దెల్పుచున్ జనులు
తండములై గనువారెగాని యా
పాపము నందె కట్టికుడు
పంగ నొనర్పగలేరు వీరులై! ౧౭

అరదమ్మున్ జననీక, అశ్వముల క
  డ్డె వచ్చు మౌనీంద్రుపై
బరచెన్ దండము నశ్వచోదకుఁడు-దె
  బ్బన్ తట్టుకోలేని మే
నొరగెన్-వృద్ధుశిరమ్ముపై క్షణిక నా
  ట్యోల్లాసమున్ జూపి దా
టె రథాంగంబులు ; దాటెనశ్వములు ; దా
  టెన్ హూణవర్గంబులున్. ౧౮

తండ్రి మడిసిన దీనవిధమ్ముఁజూడ
కాల్వలై జాలువారదు కంటినీరు ;
గాఢసంతాప రేఖలు క్రమ్మ లేదు,
మూర్ఛదేరినకన్నియ మోమునందు ! ౧౯

మిలమిల జాళువాపసిడి
  మేలిమి వెన్నెలకాంతు లీనుచున్
మలయజపుష్పగంధయుత
  మై రహియించెడి సౌధమందు రా

జిలు నునుచెక్కడంపు నగి
 షీపని దంతపు శయ్యనుంచి రా
యలికులవేణి, హూణాధవు
 నంతిపురంబున నశ్వసైనికుల్. ౨౦

తోరమానుఁడు లోనికిఁ జేరవచ్చి,
శిలను జెక్కిన ప్రతిమ నా మలయుచున్న
కన్నియఁ గాఁడాసి ; మోమునఁ జిన్ని నవ్వు
కఠిన రేఖలకిమ్మడి గాఁగఁబలికె. ౨౧

"సకల రాజన్యమస్తక స్థగితరత్న
జాలములనెన్నదగు నీదుచరణయుగళి
బిచ్చపున్ సంకెలలఁగట్టి రచ్చనీడ్చు
పతితుఁడెవ్వఁడె తోయజపత్త్రనేత్రి!?" ౨౨

ఆ పలుకులు విన్నంతనె,
ఆపు తెగిన నదికివోలె నాయమకన్నీ
రేపై జాల్వారఁగ సం
తాపంబున నిటులువలికె దైన్యముదోఁపన్. ౨౩

“ఓయి దయామయా! భవమ
హోదధిఁ ద్రచ్చిన శాంతసద్గుణ
శ్రీయుతు మేనిపై చెలగి
చిందులు ద్రొక్కిన జాతిగుండె దీ
‘తోయజపత్త్రినేత్రి!’ భవ
దోషమలీమసమైన ఆత్మకై
చేయు వ్యథాభుజంగవిష
సిద్ధదవాగ్నులలోఁ దపస్సులన్!” ౨౮

అన విని తోరమానుఁడను
“నాయతి వెంబడిఁ బోయి భిక్షులన్
దినదినగండమై తిరుగఁ
దీరునె దుఃఖము వెఱ్ఱిదాన! నీ
కనుసన నాజ్ఞలంద ధర
కాంతుడె నిల్చె ననంగతప్తుఁడా
తని కరుణించి ప్రోచి ప్రమ
దంబునఁ దేలుము రత్నరాసులన్!”. ౨౯

వాని నీచంపుటుద్యమ భావమపుడు
మెల్ల మెల్లన స్ఫురియింప తల్లడిల్లి ;
అంజలిన్ మోడ్చి ; గాలికి నటమటించు
లేత చిగురాకువలెఁ దూలి లేమ పలికె: ౨౬

“ క్షణికసుఖమ్ము గోరి పర
కాంతల మానధనమ్ము గొన్న, ఆ
ధనము హరించు వాని, వని
తన్ నిరుపేదలజేయునన్న ! నీ
పణమున కాశఁజెంది భవ
భారమునింకను పెంచలేను! వే
ప్రణతులు నీకు నీ కనక
రాసులకున్ విడుమన్న నన్నికన్ ! ” ౨౭

అలికులవేణి బోధ నవ
హాస్యము జేయుచు పల్కెభూపుఁ “ డీ
పలుకుల కేమి ! నీ వొరుని
భార్యవుగావిక పాపమేది ?! నా

వలపును దీర్చుకొన్న పిద
   పన్ నిను వీడెదనంచు నెంచఁగా
వలదెద ! అగ్నిసాక్షిగ వి
   వాహామునన్ గయికొందు కోమలీ!” ౨౮

చిరునగ వాననాబ్జమున చెన్నలరన్
   సతిపల్కె : “ కన్యనై
నరులకు సేవఁజేయుగ మ
   నంబున నెంచుచు నుంటినన్న ! భూ
వరుఁడవు, నీకు రాసుతలె
   వత్తురు వేనకువేలు కోరుచో-
ధరణి దరిద్రతన్ గనలు
   తాపస కన్యకలేల వీడు మా! ” ౨౯

“ నాకు వితండవాదనల
   నైపుణిలేదె కురంగలోచనా!
నీ కమనీయ రూపమవ
   నిన్ గల రాసుతలందు లేదు ! నిన్

జేకొని హాయిగాఁ బ్రణయ
సీమల సౌఖ్యతరంగడోలలన్
నాకముగట్టి యూగెడి ది
నంబులకై మది యాత్రమందెడిన్ !" ౩౦

"నీవు మహీశ్వరుండవయి
నీప్రజ నార్తిని ద్రోయఁజూతు వీ
త్రోవ శుభమ్ముగాదు మును
దుర్మతులై చరియించు భూపతుల్
చావరె దుర్విధిన్—మదివి
చారమొనర్పుము, మంచిత్రోవలన్
బోవు"మటన్న నావనిత
బోధల క్రోధవికంపితాంగుఁడై : ౩౧

"పలుకులు పెక్కులేల ? బల
వంతమెయైనను నిన్నుఁబొందఁగాఁ
దలఁచితి" నంచు కన్నుఁగవ
దారుణకామశిఖాళి గ్రక్క, బె

బ్బులి హరిణమ్ము డాయుగతిఁ
బోయి పొలంతినిబట్టి మానమున్
బలిగొని వీడె ఱేఁడు భగ
వానుఁడి కేపనిమీఁదఁ బోయెనో ! ౩౨

మొయిలు విడిచిన దినకరుఁబోలి దుర్ని
రీక్ష్యమై, శాంత మొల్కు నారీవదనము
ఱేఁడు గనలేక నల్లల నాడిపోవ
కరుణచిల్కెడి పల్కులఁ గొంత పలికె: ౩౩

“ నాదుశీలమ్ము భంగమొనర్చితన్న
కించలేదోయి, నీపయిఁగిన్క లేదు !
ఎన్నఁడో ఱాయిగట్టిన హృదయ మిపుడు
ఆర్ద్రమైనది నీస్థితి కంతెగాని ! ౩౪

“ ఓయి మందభాగ్యుఁడ, విను మొక్కమాట :
ఇన్నిరతనాల గూర్చుట కెన్నరాని
హృదయ రత్నంబు జార్చితి వింక నీవు
అకలుషితమైన ఆత్మతో నాదిదేవు
నెదురుకోనేర్తె వచియింపు మెన్నడైన ? ౩౫

"ధర నిను రత్నరాసులను
 దన్పఁగ నెందరి జీవరక్తముల్
వరదలుగట్టెనో! పరిభ
 వవ్యథఁగుంది సతీమతల్లు లెం
దరు ననుబోలి నీ శిరము
 నన్ విషదిగ్ధములైన నిప్పుకల్
చెరిగిరొ! భూపతీ! సతుల
 శీలము మానుల శాంతివంటిదే! ౩౬

"ధనకనకంపు రాసులను
 దాగొని, క్రుళ్లి, మురుంగుచున్న, మనో
వనజము గుల్లచేయు ధన
 వంతుల కెల్లను నిర్దయాప్రణాం
బనికనుఁగొంటి నేడు! అన
 హోయులు పేదలుగారు-మీారె! నా
తనువును ధారవోయుదు, ము
 దంబున నీవయి నీదు సేవలన్! ౩౭

"తనువు చిక్కిన పేదల కనయమేను
సేవచేయుదమనుకొంటి జీవితమున-
మనసు మాలిన్యమందిన ధనయుతునికి
నీకె యా సేవజేసిన నేకఫలమె! ౩౮

"కరుణామకరందంబున
కిరవై వర్ధిల్ల నీదు హృదయాబ్జంబున్
పరివర్తిల్లఁగఁ జేసిన
ధరపై నాజీవితంబు ధన్యతఁగాంచున్!" ౩౯

* * *

నిండిరి తోరమాన రజ
నీప్రియు లిర్వురు పెండ్లి పీటఁగూ
ర్చుండిననాటి వైభవముఁ
జూడఁగఁ బందిటిలో ప్రజల్. సభా
పండితులార్చి, దక్షిణ ల
వారిగఁ జేకొని యేగినా రహో!
రెండిట వెన్నెలల్ చిలుక
రించు మనంబును కానరింతయున్!

---

# ఆత్మవంచన

కాలపు ధాటికిన్ శపథ
కాండము లెంతటివైన నిల్వగాఁ
జాలవు; తోడుగా పదవి,
సంపద లేవుగఁ గూడుకొన్న నా
జాలమునందు చిక్కువడి
స్వప్నగతమ్మను హేయమంచు తా
మేలిన జీవితమ్ము గణి
యించుట నైజము ప్రాణికోటికిన్.

కడచిన దారుమాసముల
కాలము—సంపదలందు గర్వమున్
బుడమికి రాణినన్న యహ
మున్ మొలకెత్తెను రాణికంత; మున్
గడపు పవిత్రజీవితము,
కాంతుని సంస్కరణమ్ము, దీనుఁడై

మడిసిన తండ్రి వృత్తమును,
మానవసేవయు విస్మృతంబులై
యడుగువడెన్ క్రమంబుగను
నంత నొకానొక నాఁటి వేకువన్. ౨

మందసమీర పోతములు
మంజుల పుష్పగుళుచ్ఛసాంద్రని
ష్యంద మరంద గంధముల
నాని, ప్రభాతమనోజ్ఞపాదపం
క్తిం దగఁగూడి తన్నుగిలి
గింతలువెట్టుచు లేపువేళ, నా
క్రందన మొండు వీనులఁ గ
రక్కున దాకెను హూణ రాజ్ఞికిన్. ౩

అది నారీకంఠస్వర
మిది వరలోవిన్నయట్టు లెంతయు ప్రాణ
ప్రదమైనట్టులు రాణికి
హృదయంబున రేగె నెన్నియేని కలంతల్. ౪

ఆ నిశ్శబ్దము ; ఆ ప్రభాతసితరా
    గౌన్నత్యమున్ ; స్వీయదో
షానీకాన్వితమైన యాత్మయు ; మదిన్
    సఖ్యస్మృతిన్ రేచు నా
దీనాలాపమునన్ విషాదగతి ను
    ద్దీపింప, నస్రంబులై
రాణిన్ నొంచఁదొడంగె పూర్వశపథ
    వ్రాతంబు లొక్కుమ్మడిన్. ౫

కలఁతసైపక యొక పనికత్తెఁజేరి
ఆర్తనాదంపుఁగారణ మరయఁబంపి
చలనచిత్రంబులట్లు చక్షులకుఁగట్టు
పూర్వ ఘట్టంబులన్ గాంచి మోముదించి : ౬

" అకటా ! చెప్పిన దొక్కటై తుదిని చే
    యంబూను కార్యం బదిం
కొకటౌరీతి చరించి పాపపథమం
    దున్మత్తనై తూఁగుచున్

సకలాపత్పరితాప సంక్షుభితులఁ
    సంపన్నతాజాలమం
దు కనుల్ గానక విస్మరించితి ప్రభూ !
    దోసంబులఁ సైపుమా ! ” 2

అని వాపోయెదు నెడలం
బనికత్తియ వచ్చి దెల్పె భటులొాగి సుంకం
బును చెల్లింపని పాణిజ
యను వృద్ధను గట్టియీడ్చుటరదము వెనుకఁ!
తా నొకనాటి రేయి, తన
    తండ్రికి మాధుకరమ్ము వీట సుం
తేని లభింపకుంట, దహిం
    యించెడి యాకలి సొమ్మసిల్ల నీ
పాణిజ జాలిఁదూలి పసి
    పాపకు దాచిన పాలఁదెచ్చి నా
డానిక నిచ్చుటాది తన
    యఁ వలె తన్నుగణించు ఘట్టముల్
రాణి మనంబునఁ దవిలి
    అంపపుకోఁతలు వెట్టనంతటఁ ; 3

దూరమునన్ వినంబడిన
 తొయ్యలి రోదన మంత దాపుగాఁ
జేరుట వీనులన్ దవిలి
 చెచ్చెర నామె తెరల్ దెరల్చి యా
సోరణ గండ్లనుండి గనె
 స్రుక్కి సురింగెడి వృద్ధపాణిజన్
క్రూరులు హూణు లారథపుఁ
 గొమ్మున బద్ధనొనర్చి యీడ్చుటన్. ౧౦

హూణరథాంగముల వెనుక
వీనుగవలె వ్రేలుచున్న వృద్ధయవస్థన్
రాణి కని, భటులకంపెను
పాణిజ విడువంగ నాజ్ఞ పనికత్తియచే. ౧౧

అరదమ్మా పనికత్తె చేరుటకు ము
 న్నా చీకుమేన్ భూమిపై
కొరగెన్ ; " వృద్ధ శిరమ్ముపై కుణికనా
 ట్యోల్లాసమున్ జూపి దా

టె రథాంగంబులు, దాటెనశ్వములు, దా
టెఁ హూణ వర్గంబులుఁ, ”
పరదా మాటున గుండెలో పిడుగు లు
త్పాదిల్లి రంపిల్లగఁ ! ౧౨

వేలకు వేల్ రథమ్ములతి
వేగముగా మది పర్వులెత్తె; చ
క్రాల రయమ్మునడ్డిన శి
రమ్ములు బంతులవోలె మింటికిఁ
దూలెను; మొండెముల్ ధరణి
దొర్లె వికావికలౌచు కండ్ల కా
వేళ భరింపరాని పరి
వేదన గొల్పుచు హూణరాజ్ఞికిఁ ! ౧౩

ఆ నాడంతయు: “ తల్లిదండ్రులటు బా
ల్యం బాది నిన్నోము మా
ప్రాణంబుల్ గొని యెట్లు హాయిగ ధరఁ
పాలింతువే?” యంచు నా

రాణిఁ పృచ్ఛనొనర్చుచుఁ దవిలె పూ
ర్వప్రజ్ఞలఁ రేచుచుఁ,
నానానేక వికార హాసములతోఁ
నల్దిక్కులఁ మూర్ధముల్ ! ౧౮

మనమున రేగుబాధ నణు
మాత్రము చూపక, సంజవేళ, చ
క్కని వలువల్ ధరించి, మణి
కాంచనభూషణభూషితాంగియై
చనినది హూణరాజ్ఞి చెలు
సాలమొగంబుగ, రాజవీధులఁ
తను జనులక్కజంపడుచు
తండములైకన, తేరులేకయే ! ౧౯

ఆ యమ వింత పోకడకు
నచ్చెరు వందుచు, వెంట నంటియుఁ
డాయగ తెంపులేక, శక
టంబులు, సేవకులున్, సఖుల్, భటుల్

పోయిరి బారులై, మకరి
  మోమునసుండి గజేంద్రుఁ బ్రోవగాఁ
బోయెడి శౌరివెంట వడి
  పోయెడి నాకనివాసులో యనఁగ. ౧౬

మోమునెత్తక చెచ్చెర పోయిపోయి,
వెనుక వచ్చెడి సేవక బృందములను,
బాట కిరుపార్శ్వముల నిల్చు ప్రజలదెసను,
చూడకయె సాగి చెఱసాలఁజొచ్చె రాణి. ౧౭

పన్నులీయఁగలేమి కన్నులఁబొడువంగ
  వెఱ్ఱికేకలవైచు పేదలొకట,
భటులనెదుర్కొన బాహువుల్ ద్రుంచిన
  పెడబొబ్బలన్ బెట్టు వీరులొకట,
భటులవాంఛల తృప్తిపరుప నీకొనకుంట
  'పతులఁజంపిన నేడ్చు భార్యలొకట,
నరపతి నిందింప నాల్కలు చీరిన
  మూల్గుచు తపియించు ముసలులొకట,

పాలకేడ్చుచు కనలేడి పాపలొకట ;
హూణ దానవ చర్యల కుత్సుకమున
ధరణిపై జేఁడు గట్టిన నరకమనగ
భయద దృశ్యంబులన్ మీఱె బందిగృహము. ౧౮

బందిగృహంపు రక్షకులు
 పార్శ్వములన్ తనుగొల్చివచ్చి అం
దందు గలట్టి బంధితుల
 యారడి చర్యల, రాణి మెప్పులన్
బొందగ, లేని వున్నవియు,
 బొంకులు చెప్పుచుఁ జూప పూనిమై
బందెనుజూచు రాణిదెస
 వచ్చెను భామయొకర్తె పర్వునన్. ౧౯

"ఆ యమ పిచ్చి"దంచు భటు
 లార్చుచు చెంగున బోయి పైదలిన్
డాయగ, రాణిమోమున త
 టాలున నుమ్మి, వికారహాసమై

ఆ యమ: "సంపదల్ వలచి
యమ్ముడు పోతివె రాణివైన రం
డా!" యని గేలిసేయుచు ర
యమ్మునఁబోయిన, రాణి శాంతమై. ౨౦

వెంటదవిలెడి భటులను పిల్చి నిలిపి
"ఆమె కేవిధముగుహాని యైన మీకు
ప్రాణముల్ పోవు, మెల్లఁగ పట్టితెండు,
పొం"డటంచు నాజ్ఞనొసఁగి పుచ్చెనంత. ౨౧

పిల్లియై వచ్చి నిల్చిన పిచ్చిదానిఁ
గాంచి, భటులను పోఁబల్కి, కరుణఁజిల్క
వీక్షణంబులఁబరపుచు వెరపు నుడిపి,
కరముగైకొని పల్కె నక్కాంతకిటులు: ౨౨

"అమ్మా! అమ్ముడు పోతినంచిపుడు న
న్నన్నట్టి నిందల్ యదా
ర్థమ్ముల్! భీతిలనేల? ఈ భటులునిన్
రవ్వంత శిక్షింప లే

రమ్మా! ఎవ్వతె వీవు? నీ పతి యెవం
    డో? నర్భకుల్ గల్గిరే?
ఇమ్మాడ్కిన్ చెఱసాలఁదూలుటకు నీ
    వే నేరమున్ జేసితో?" ౨౩

కన్నుల బాష్పముల్ దరల
    గద్గదిక స్వర యాచు లేచి యా
యన్నులమిన్న రాణి భుజ
    మందు తటాలున వ్రాలి, గుండెలో
మున్నుడు కెత్తుచున్న యను
    భూతిని నైపక, రాణికౌగిటన్—
కన్నయిసుంగు తల్లి యెదఁ
    గాసిలు రీతిని—క్షమ్మరించి, "నే
నన్నవి నైపుమమ్మ! నిజ
    మారయఁజాలఁగనైతి నంధనై!" ౨౪

"నాపతి వీరదేవుడను
    నామము వాఁడు; సునంద నేను; మా

పాపలు రెండురత్నములు,
　　బాలకుఁడొక్కఁడు బాలయొర్తు ; నా
కాపుర మెల్ల బుగ్గియయి
　　కాటికిఁబోయిన దమ్మ! నాథునిన్
పాపలఁ బొట్టఁబెట్టుకొని
　　బాయకయుంటిని మొండిప్రాణముల్. ౨౫

" వినుమొకనాడు నల్వురరి
　　వీరులు హూణులు వీటఁజొచ్చి, నన్
గని తమకోరికన్ దెలుప,
　　కాళ్లపయిన్ బడి వేడుకొన్న, నా
మనవిని గేలిసేసి సుకు
　　మారుల పాపలఁ బ్రాణనాథునిన్
గొని, బిగగట్టి, కత్తులను
　　గుండెలపైనిడి నన్నుఁజూచి 'మా
మనసును దీర్తువా? వరకు
　　మారుల కత్తుల పాలొనర్తువా?' ౨౬

"తెంపరు లట్లు పల్క విని
  ధిక్కృతి జూపుచు నేను 'మానమే
పంపున నైన మానవతి
  భంగమొనర్పగ నిచ్చగించునే?
చంపిన చంపికొం' డనుచు
  చతులమూసిన, పాపకర్ములు
గ్రంపువిధిన్ వధించి, ననుఁ
  గాంచి హసించుచు మేలమాడుచున్:  ౨౭

"'త్రోలుత వచించినన్ వినక
  తూలుచు మానమటంచు బోధనల్
సలిపిన లాభ మూష్పులిటు
  చచ్చుట గాకిక నేమి గల్గెనే
జలజదలాక్షి! నీ కిపుడు
  చచ్చిన వారు సహాయమాదురే?
తెలుపు' మటంచు కామమును
  దీర్చుక బందిని బెట్టి రమ్మ నన్!  ౨౮

"నాదీనచరిత్రం బిది—
వేదన సహియింప లేక ప్రేలుచు నిను నెం
తోదూషించితి మును, నను
సాదరమున గాంచి, తప్పు సైపుము దేవీ!" ౨౯

అన్న, సునందదీనకథ
నానిలధూతవిషాదమేఘసం
ఛన్నముఖేందుబింబయయి,
చక్షువులొల్కెడి బాష్పవృష్టి చే
లన్నిలువంగనొత్తి, భటు
లన్ గని రాణి: "రథమ్ముపైన నీ
యన్నులమిన్న నంతిపుర
మందున జేర్పు"డటంచుఁ బల్కెనన్. ౩౦

వారు సునంద నారథము
పైఁగొనిపోయిన తోడ రాణియున్
వేరొక తేరునెక్కి, పుర
వీధులనెల్ల గమించి, ఆపగా

తీరమునందు శాక్యముని
　　దేవుని ఆలయమందుఁజొచ్చి, సే
వారతి చేయి మోడ్చి, తన
　　పాపములన్ తలపోసి కుందుచున్ : ౩౧

"నీ కరుణావలోకకమ
　　నీయసుధారసవాహచంద్రికా
నీకమునందు నాహృదయ
　　నీరజ మార్ద్రమొనర్తు వంచు నీ
రాకకు వేచి నిత్య మను
　　రక్తి భజించి రచించుకొన్న నా
నాకము గూల్చి నాదు పత
　　నమ్మును గాంచి హాసింతువా ప్రభూ ! ౩౨

"నీవె సమస్తజీవులకు
　　నెయ్యము నేర్పఁగలాడ వంచు నీ
పావన పాదపూజకయి
　　భద్రముగా విరులేర్చికూర్చి నీ

సేవకు వేచి వేసరిన
　చిత్తము విహ్వాల మందు చున్న దీ
పూవులు వాడి వత్తలయి
　పోయిన వీదెస చూడవేమయా? ౩౩

"మునివరు చావులో మొదట
　బోధనొనర్చియు నీపరీక్షకై
కనకపురాసులన్ గనుల
　గప్పి విమోహమునందు ద్రోసి, నా
జననినిఁగూడ జంపి, భవ
　జాలము పెంచుచు సత్యమార్గమున్
కనుఁగొన లేని రాణిగ నొ
　నర్చితి వేమయ నన్ను దైవమా! ౩౪

"మున్నొక నాడు నీ కనుల
　ముందొక పారవతమ్ము బాణ వి
చ్ఛిన్న పతత్రమై ధర న
　చేతనమై పడ, రక్తబిందువుల్

కన్నులగార్చు నీ హృదయ
 కంజము నేడిటు లెక్కలార్చి యా
పన్నతఁదూగు నాపయిఁగృ
 పారసమింతయు జిల్కదేమయా ? 37

“నీదు సుబోధలన్నిటికి
 నిక్కపుటాచరణంపు మార్గ మీ
పేదలసేవయే యనుచు
 పేరిమి నమ్మి చరించుచున్న నా
కేదరి చూపకున్న నెటు
 లీభవసాగర మీదుదాన ? నీ
పాదయుగమ్ము తప్ప భువి
 పైనిక నాశ్రయ మేదయాప్రభూ ! 38

“లోకము నీదు బోధనల
 లో తన దుఃఖములన్ జయించి య
స్తోక సుఖమ్ములన్ వరలి
 తూగుచు నున్నదటంచు నెంచగాఁ

బోధము ! నాటి కష్టముల
మోఘముగా పెనుపందె ; నేడు నీ
రాకకు వేచి లోక మెటు
క్రాగెడినో కనువిచ్చి చూడుమా ! ౩౭

" చీకటి మాటునన్ జగతి
చిందులుద్రొక్కుచు నుండ, నెప్పుడో
ఆకసమందు తారవలె
నం దొకసారి మినుక్కుమన్న నీ
పోకడ మాకు తెల్లమయి
పోవునె సామి ! త్వదీయ హస్తమున్
గైకొని మెల్లగా యుగయు
గమ్ములప్రాకిన గాక యోప్రభూ ! ౩౮

" లెక్కకు మీరి వర్షములు
లిప్తలుగాగతియించె ; రాజ్యముల్
ముక్కలు చెక్కలై సమసి
పోయెను ; శిల్పులు నీదుమూర్తి ముఱ

జెక్కడి వేళ జీవకళ
 చిల్కిన నీ దరహాసమొక్కటే
నిక్కముగాగ నేఁటికిని
 నిల్చెనయా అమృతంబు లొల్కుచున్! ౩౯

"నమ్మి భజించితిన్ త్రిశర
 ణమ్ములె దిక్కని, నాదు నాసలన్
వమ్మొనరింపఁజూతువ త
 పమ్మునటించుచు దేవదేవ! హా
సమ్ములనక్కి, భక్తులకు
 స్వర్గముఁజూపుచు మాయుచుంటివీ
వెమ్మెయి నేర్చితయ్య భువి
 నీ కికురింతలు దాఁగుమూఁతలున్!? ౪౦

"విత్తము గోరలేదు; నిను
 వేడగలేదయ ముక్తినైన; ఉ
న్మత్తతఁదూగి ధర్మమును
 మాని విపన్నుల విస్మరించి, నా

చిత్తము నీ పరీక్షలను
 చేవ నెదుర్కొనలేనినాఁడు నీ
యుత్తమహస్త మూతనిడు
 మో ప్రభు! చాలు తరించిపోయెదన్!" ౪౧

అని యిటు బుద్ధదేవు చర
 ణాంబుజ మంటి భజించుచో, నిశాం
గనధరియించు దట్టమగు
 కాటుక రంగుపుటంబుపైన న
ద్దిన జలతారు పువ్వులటు
 దిక్కులనెల్ల వెలుంగఁ జేయఁగా
మినుకుమినుక్కుమంచు నగె
 మింటను తారలనంతకోటులై! ౪౨

# పరీక్ష

సెజ్జపై రాత్రిమదిరేగు చింతజేసి
కంటికిసుమంత కూర్కు రాకుంటరాణి
హృదయమున బుద్ధముని దేవు నెంచుకొంచు
చక్షులన్ మూసినంతట స్వప్నమందు :           ౧

తెలతెలవారు వేళనొక
దివ్యతపోమహిమాన్వితప్రభా
విలసితమూర్తి, మోముపయి
పిన్నని నవ్వు తురంగలింప, చూ
పులు దెసలందు శాంతరస
పుంజము లొల్కగ, రాచదేవి మైఁ
గులుకగ వచ్చి, రాణిఁగని
కూర్మి వచోఽమృత మొల్కనిట్లనున్ :           ౨

" మండిన నాదు గుండియల
  మాటున నెన్నొ దవాగ్నులారె; బ్ర
హ్మాండము లార్తి నే గురియు
  నశ్రుల నెంతొ చెమర్చె; దేహమున్
భండనమందు నట్టులె త
  పమ్ములలో శ్రమియించెనమ్మ! కా
కుండిన జీవి బుద్ధపద
  మారక యందునె భోగతుష్టుడై?

" ననువలె నెప్డు మానవులు
  నాకపదమ్మున కర్హులౌనటుల్
మనుచు, ప్రబుద్ధులై, జగతి
  మైత్రి రహింపగ నెల్లజీవులన్
కనుగొని ప్రేమరాజ్యమును
  గాంచి వసింతురొ, నాటితోడ నా
పని జగమందు పూర్తియయి
  బాధ లదృశ్యములౌను పుత్త్రికా!

" నావలె నెందరో జగము
నన్ విలసిల్లి యుగమ్ములందు నా
ర్తావనదీక్షఁ బ్రాణముల
నర్పణఁ జేసినఁగాని మానవుల్
లేవఁగ లేరు బుద్ధులయి
లిప్తలలోననె మార్పు జెంది, బి
డ్డా! వగవంగ లాభ మిసు
మంతయు లేదు సహింపు గష్టముల్! ౫

" అలయక యొక్క కష్టతర
మైన పరీక్షకు రేపు నిల్చినన్
గెలుతువు నాదు సన్నిధిని
నిర్వృతి " నంచు నదృశ్యుఁడయ్యె నా
విలసితమూర్తి; రాణి కను
విచ్చిన దంతట దిక్కులెల్ల కాం
తుల వెలయుంగ నవ్వినది
తూర్పున వేగుపడంతి పక్కనన్. ౬

అంతకుమున్ను రాణి పుర
మందున నొంటిగఁ బోయి బందెలో
కాంతకు స్వేచ్ఛనిచ్చుటయు,
క్రమ్మర పోయి రథమ్ముపై నదీ
ప్రాంతమునందు నెంతొ వడి
ప్రార్థన సల్పిన చిత్రగాథ వి
న్నంతనె తోరమానుఁ డొగి
నంతిపురమ్మును జొచ్చి దేవితో :

“ అరినరపాలజాలమకు
టార్చితపాదసరోజుఁడైన భూ
వరునకు రాణియయ్యు, పరి
వారము లేకయె సంజవేళ ని
ప్పురమున వీధివెంబడిని
బోయి యొకానొక పిచ్చిదానినిన్
చెఱ విడిపించెనంట యొక
చేడియ ! వింటివ కేు మనోహరీ !

"ధరణీకాంతులు నీదునానతులకై
  ద్వారంబులం దేడ్వఁగా
చెఱసాలన్ బడి వెట్టిఁ దూలు నొక రా
  జీవాక్షి దప్పింపఁగా
పురమం దొంటిగ తేరులేక నడకన్
  బోనేల యో దేవి! నా
మరియాదైన గణింపవైతి విటు లీ
  మాత్రంపుఁ గార్యంబుకై!" ౯

అనుచు హాస్యమ్ము చిఱుకోపమును నటించి
మందలింపంగ, ఖేదమ్మునంది, కనుల
నత్తమిల్లెడి బాష్పమ్ము లొత్తికొంచు,
హూణధవుగాంచి యీరీతి రాణి పల్కె: ౧౦

"పేదల దుస్థితిన్ గని త
  పించుటెగాని, జనించు టాదిగా
పేదల చేతులన్ బెరిగి
  భిక్షుకులౌ ననుబోంట్ల కిమ్మహిన్

పేదల ప్రాణమానములఁ
బీల్చి యహమ్మున వీగు రాచమ
ర్యాదలు గొంతుకోత లెటు
లబ్బెడు నయ్య్య వచింపు భూపతీ ! ౧౧

"నీదు పిశాచ కృత్యముల
నిత్యముగాలు నదృష్టహీను లా
వేదనఁదూలి శాపముల
వ్రేల్చుచు నుండ నహమ్మువీడ వా
పేదల రక్షణంబె పృథి
వీపతి కీర్తికి వన్నెగాని, మ
ర్యాద రథమ్ములెక్కి పుర
మందు చెలంగినయంత గల్గునే ? ! ౧౨

"పాలితులందు ప్రేమయును
భక్తియు పుట్టెడు రీతి నేమహీ
పాలకుఁడేలు నాతడె నృ
పాల పదమ్మున కర్హుడౌను ! ము

న్నేలడె శాంత మొప్ప, నసి
 నేనియుఁదాల్చ కశోకుఁ డాతనిన్
బోలుదె, నిన్ను, నీ సిరుల
 మొత్తముగా కలగట్టి తూచినన్! ౧౩

"కరుణయు, శాంతం, బణకువ,
సరసతయును పేదలందు సామాన్యంబుల్
నరపాలురకవియె యలం
కరణములౌ సిరులు గర్వకారణమౌటన్!" ౧౪

అనుచు హితవాక్యములను బోధన మొనర్చు
రాణిఁగని నవ్వుచును తోరమానుఁడనియె:
"కాంత! నీకెన లేరు జగమ్మునందు
వాదనలలోన బోధన పటిమలోన! ౧౫

"ధరణీపాలన మంతిసాధముల, శాం
 తమ్మంచు వాగ్వాదనా
సరణిన్, సల్పగ నౌనటంచు మది
 చన్ బోకు! ఖడ్గమ్మె లే

క రిపుల్ చత్తురె వేడుకొన్న ? జను లా
కర్ణింతురే తేని ? ఒ
క్కరుడైనన్ దనయంత కానయిన సుం
కం బిచ్చునే తెల్పుమా ? ౧౬

" శాంతమటంచశోకు డని
సల్పక చేసినకార్యమేమి ? తా
నంతమునందినంత మగ
ధావని కూలి నశింపలేదె ? వే
దాంతుల పాలి భూమి పర
హస్తగతమ్మగు పుస్తకమ్మొ ! శు
ద్ధాంతములేలు చేడియవె
టర్థము నీకగు రాజ్యతంత్రముల్ ! ౧౭

" రాజ్యతంత్రమ్ము నీతిదూరమ్ము సుమ్ము !
ఒక్క యొరఁబట్టవీ రెండు నుర్వియందు !
ఖడ్గమును దాల్పకున్న భూకాంతునోడ్చు
బాలకుండేని తోయజపత్త్రినేత్రి ! " ౧౮

అనవిని రాణి వల్కె, "నక
టా! క్షణభంగురమైన రాజ్యమున్
గని యది నిత్యమంచు నెద
నమ్మి విమోహములందుఁ జిక్కి స
జ్జనుల కరాసికిన్ బలి నొ
సంగి చరించెడి నీదు ఆత్మవం
చనలను రాజధర్మమని
సంబర మందెద వేల మూఢుడా! ౧౯

"కత్తియె రాజ్యపాలనకు
కాగల సాధనమంచు నమ్మి, క్రో
న్నెత్తురు ద్రావు క్రూరుడవు!
నిన్ రణవీరుల ఘోష కన్న ఆ
పత్తులఁ దూగి వ్రేగు పసి
పాపల మౌన మమోఘ శాపమై
మొత్తును నీ చరిత్రములు
పూర్వపురాణములై నశింపఁగన్! ౨౦

" తలకొొక పన్ను వైచి, యతి
 దారుణహింసలఁద్రోసి పిండుచున్,
మలమల మాడుపేదల స
 మాధులపైని పిశాచ నర్తనల్
సలిపెడి నీ మహా విభవ
 సంపద లెవ్వని గుండెమంటకున్
బలియయిపోవునో ! నిలుతు
 వా, అసిచేకొని యాపరీక్షకున్ ! ? ౨౧

" భువిపయి నారు మాసముల
 ముచ్చట బండిన పాపమిట్లు నన్
దవిలి దహించుచుండెనన—
 దారుణమారణహోమమందు మా
నవులను వ్రేల్చుచున్ జగము
 నన్ తన జీవితమెల్ల నీడ్చు భూ
ధవునకునైన శిక్షలను
 దండధరుండు నెరుంగ జాలునే ? ౨౨

"సదయత జనులకు శ్రేయం
బెద గోరుచు సుఖముల తనియించుచు ప్రేమా
స్పదుడై యేలని నృపు సం
పద లేలా? రాజ్య మేల? బ్రతు కేల భువిన్? ౨౩

"కాలము చెల్లి, పౌరుషపు
కావర మీల్గి చరించునాడు ని
న్నాలమునందు శత్రునృపు
లాహుతి జేసెడివేళ గాతురే
శ్రీలవరించి నీ దరిని
జేరిన నీదు భటాళియేని, నీ
యేలు బడిన్ దపించి ప్రతి
హింసను గోరు జనాళియేనియున్? ౨౪

"శాంతవిధి వేలొసంగెడి జనులుగూడ
ఖడ్గమును జూప నిడరొక కాసు పన్ను;
కాలకూటంబు నయమున గ్రోలువారు
భయముజూపిన గ్రోలరు పాలనైన! ౨౫

" పన్నులనీయగ లేని వి
పన్నుల బాధింపఁబోక పావనమార్గం
బెన్నడు విడనాడక జన
సన్నుతులన్ మనుము, గొనుము శాశ్వతకీర్తిన్ !"

అనుచుఁబల్కిన నిక బదులాడ నోడి
అంతదనక్కను హాస్యమ్ము లాడు ఱేఁడు,
శాంతమును నోర్చు నొక్కట సన్నగిల్ల
విసువుగొంచిటుపల్కె వెక్కసము తోప: ౨౭

" నిను గొనుటాది నీరసపు
నీతులఁజెప్పెడిగోలె కాక, నన్
ప్రణయసుధారసాంబుధిని
రంజిలఁజేసిన దెన్నఁడే సఖీ !
మనమునపట్టు పంత మణు
మాత్రము వీడరు నాథుడన్నచో ;
చనవుగలట్టివారి యెడ
చంచలచిత్తలు కారు మానినుల్ ! ౨౮

“వినుమిటు పంతమూన తగ
వే? తనుమాలిన ధర్మమున్న దే?
‘జనులసుఖ’మ్మటంచు నిజ
సౌఖ్యములన్ విడనాడి రేపవల్
కనలెడి నీదువైఖరుల
గాంచిన పన్నుతోలంగఁజేయ నీ
వానరుపఁబోని కార్యమిల
నుండగ బోదని యెంతు నెమ్మదిన్! ౨౯

“అనునిముసంబు నీదు ప్రణ
యాంకిత వాక్సుధకై శరీరమం
దణువణు విట్లు సంక్షుభిత
మై, హృదయంబున రేచు తీవ్రవే
దన వడిమ్రగ్గుచుండ దయ
తల్పక ‘దేవుడు’, ‘దయ్యా’మంచు నా
ప్రణయమునింత నిర్దయఁ ది
రస్కృతిమ్మొనరింప పాడియే? 30

"వేదనాజ్వాల నుడు కెత్తు నాదుమదిని
నెయ్యమొక్కింత చిల్కని నీదుమదిని
కాంచడే నీదు దేవుండు? చంచలాక్షి ?"
యనిన నవ్వుచు ధవున కిట్లనియె కాంత : ౩౦

"నాపయి కోర్కెచే ననుది
నమ్ముడు కెత్తెడి నీదునాత్మ సం
తాపమునందు మాత్రమున
తా పరిపక్వత నందఁబోదు; తత్
తాపతరంగభంగములఁ
దార్కొను క్షోభ గణింపఁబోవ రు
ద్దీపితమానసప్రకర
తీవ్రగభీరత మెచ్చు దేవతల్ ! ౩౧

"పసులవలెన్ జనాళి వల
వంతల ద్రోయుచు, ప్రేమయంచిటుల్
విసువదిలేక నాకయి త
పింప నిరర్థక ; మొక్కవ్యక్తిపై

యొసగెడి ప్రేమ, సంకుచిత
    దృక్పథమందు నశించు కామమై,
వసుధ సమస్త జీవతతి
    పై బ్రసరించెడి జ్యోతి కానిచో! 33

" నిరుపమ సౌఖ్యసంపదలు
    నెక్కొన నేలిన చక్రవర్తివో,
తిరిపెము లెత్తి కష్టతతిఁ
    ద్రెళ్లి తపించిన యట్టి పేదవో,
ధరపయి నీవు గైకొను మ
    తం బెదియో గణియింప డీశ్వరుం
డరసెడి దీ విలన్ జనన
    మంది యొనర్చిన కార్యమొక్కటే! 34

" కంటికి ఱెప్పగా బ్రజల
    గాచుట మేలనియంటి; సజ్జనుల్
కంటను నీరుపెట్ట ససి
    గాంచవు రాజ్యములంటి; ఆయుధ

మ్మంటక రాజ్యమేలుకొను
    మంటిని; ధర్మపథమ్మనంటి పో
మ్మంటి, శుభమ్ములందు మని
    యంటి; గణింపవి కేమి చేయుదున్. ౩౭

"కరుణనుజూపి సుంకముల
    కై ప్రజనేచుట వీడుదన్క నీ
చరణము వీడఁజాల," నని
    సారసలోచన నాథు పాదమం
దొరగిన, బుద్ధదేవు పద
    యుగ్మరజః పరిపూతమైన త
చ్ఛిరమును దన్నె పాపమయ
    చిత్తుఁడు ఱేఁడు వివేకహీనుఁడై. ౩౮

జొటజొట ఫాలభాగమున
    సోనలు కట్టి స్రవించు నెత్తురుల్
పుటమున నొత్తికొంచు, పరి
    పూర్ణదయారసవీక్షణంబుతో

అటమట లేక తన్నుగను
నంగన గాంచి ధరేశుడంతటన్
పటపట పండ్లుగీటుచును
బల్కెను రోషకషాయనేత్రుడై : 32

"తిరిపెములెత్తి వీధులను
తిర్గు బికారిని దెచ్చి రాజమం
దిరముల నుంచి సంపదలఁ
దేల్చినయంతనె గానగల్గునే
నిరుపమసౌఖ్యమార్గమున
నెమ్మిచరించు నదృష్టమిద్ధరన్ ?
పురువుల నేరు కుక్కుటము
పోవగ దన్నదె జాతి రత్నముల్ ? 33

"కరువగ నేర వార్చు శున
కమ్ములటన్న విధాన నీతులన్
గరపెడి వార లాచరణ
కై వడి రారు ! జనాళిసేవయం

చరచితి వెంతో — ఎల్లియుద
　యమ్మున నొంటిగ వస్త్రహీనవై
పురమున దిర్గుచో విడిచి
　పుత్తును సుంకములెల్ల తిర్గుదే?!" ౩౯

అన — నివాత సరోవర మట్లు మోము
శాంతగంభీరముద్ర నిశ్చలముగాగ
లేచి రజనీప్రియ ధవునిఁ జూచి పల్కె,
నేటికిని గూడ మార్మ్రోగు నాటిపల్కు: ౪౦

"మనుజపతీ! ప్రజాసుఖ మ
　మందముగా భవదీయ రాజ్యమం
దొనరగఁ జేయగా నగు మ
　హోత్తమ కార్యము పట్ల మాన మ
ర్పణమొనరింతునెల్లి! అను
　రాగము, త్యాగము నాతి సొమ్ము లం
చనియెడి వాక్కులీపయిని
　సార్థకమై చను నాచరిత్రలో! ౪౧

అరమర లేక నీవనిన
 యట్టులు పన్నుల వీడగా పరా
రుని పదమ్ములాన శప
 థమ్మొనరించి వచింతు వేని నే
ంరదముపైన నెల్లియుద
 యమ్మున వస్త్రవిహీననై పురిఁ
రిగెద వీథులన్నిటను
 దీనుల కంతట గల్గుము క్తియుఁ!" ౪౨

ంనిన కోప మసూయయు నచ్చెరువును
ఏదిని ముప్పిరిగొన, తోరమానుఁడంత,
సూట తిరుగంగ లేక, యమ్మగువకోరు
ంధమునఁ బాస నొనరించి వేగచనియె. ౪౩

ననినఁ రాణియు భక్తిమై మనమునఁ
 శౌద్ధోదనిఁ దల్చి: "నీ
రునుకంపఁ మదినెంచి ధైర్యమున నే
 నావేదనాతప్పులా

జనులన్ బ్రోవఁగ నెంచి రేపట పరీ
క్షన్ నిల్వ నుంకించితిన్ ;
మనమున్ గొంకెడు, ధైర్యమూగెడిని! మా
నంబెట్లు కాపాడెదో ? ” ౪౪

అని నిశ్చలమతి బుద్ధుని
మనమున ధ్యానించి లేచి మానిని తోడన్
పనికత్తెను జీరి పురం
బున నొక విన్నపము జాట పుత్తెంచె వెసన్. ౪౫

## సిద్ధి

"బుధజననుతులార ! పురవాసులార !
రారయ్య విన మహారాణి విన్నపము !
'ఒంటరిగా నెల్లి యుదయాన పురిని
అరదమ్మునందు నే నన్నివీధులను
చని, వస్త్రహీననై చరియించునెడల,
ప్రజలపై విధియింపఁ బడిన పన్నులను
తొలగింపగా జేఁడు తోయజాతాక్షు
పదయుగ్మమానగా బాసనొనర్చె !
ఎల్లినే వస్త్రవిహీననై పురిని
చరియింపగా ప్రతిజ్ఞఁ గొంటిగాన—
సద్గుణనిధులార ! సజ్జనులార !
పూజ్యచరిత్రులా పురవాసులార !
భక్తిపూర్వకముగా ప్రణతి నొనర్చి
నాచేయువిజ్ఞాపనం బిదే మీకు—

తల్లిగా నన్నెదఁ దలచువారేని,
ఎల్లినే వీధులం దేగెడివేళ
ద్వారంబులెల్ల గవాక్షంబులెల్ల
బంధించి గృహములఁ బాయకమీరు
కరుణ నామానంబుఁ గాపాడరయ్య!'

* * *

బుధజననుతులార! పురవాసులార!
రారయ్యవిన మహారాణి విన్నపము." ౧

అని చాటించుచు, ఢక్కఁగొట్టుచు, భటుం
డా వీటిలో, రాణియుం
పిన సందేశము వాడవాడలను వి
న్పింపఁ, సమూహంబులై
జనముల్ మూగిరి రాజవీధి నృపు దా
ర్జన్యంబు నిందించుచుఁ,
తన సర్వంబిటు వీటబుచ్చు సతి స్వా
ర్థత్యాగ మగ్గించుచుఁ. ౨

అలఘు సతీ త్యాగంబును
ఖలుఁడౌ నాఁతేని చిత్తకాఠిన్యంబున్
తల తల, కార్చిచ్చటుపురి
కలయంగాఁ బ్రాకె జనులు గగ్గోలువడన్. 3

"కలఁగునె దీనికింక భవ
కల్మషపూరితకార్యసక్తుఁడై
చెలగిన క్రూరమానసుఁ డి
సీ!" యని తేని శపించువారునున్;
"తలఁగక ప్రాణమానముల
త్యాగమొనర్చు సతీమతల్లికిన్
ఫలమిదియౌనె? లేఁడు భగ
వంతుఁడు లే" డని యార్చువారునున్; 4

"పాపంపు వృక్షంబు ఫలవంతమై పండె
మనుజేశ్వరునకు నే" డనెడి వారు;
"త్యాగమూర్తికి, సత్యధర్మశీలకు మాన
భంగమా!" యని మది క్రుంగువారు;

"ఈ జేనికై క్రొత్త రౌరవంబొండు త
    య్యారయ్యొ" నని యంగలార్చువారు ;
"కన్నతల్లిని గావగాలేక మనుపీన్గు
    లల్లైతి" మని ఖేదమందువారు ;
"కటకటా! యెట్లు రాణికి గడచు రేపు!
విధియెటున్నదో" యంచు తపించువారు
నై, జనుల్ తాపసంభరితాత్ములగుచు
పొక్కిపోయిరి పురి మూలమూలలందు! ౫

"అమ్మా! పర్వతరాజపుత్త్రి! దురిత
    వ్యాసక్తుడౌ భూవరుం
డిమ్మాడ్కిన్, జనకల్పవల్లి నబలన
    హింసింపనుంకించి—మా
నమ్మున్ భంగమొనర్పగాగడగు చం
    దంబిట్లు సైరింతువా?
వమ్మైపోయినవేమి తల్లి! భవదా
    పద్రక్షణాదక్షతల్! ౬

"అంచితమూర్తి ! ఆశ్రిత జ
నావన విస్తృత కీర్తి ! నీవు ర
క్షించుట భారమాయె నిజ
జీవిత మార్తజనాళిసేవ వె
చ్చించిన త్యాగమూర్తిని ? ప్ర
సిద్ధదయాన్వితలా భవాదృశల్
వంచన చేయుచో నరయు
వారెవరింక జగత్కుటుంబినీ ! ౭

"మేమిట నోచు నోములకు
మీమదికింపుఘటిల్లెనేని, నా
రీమణి వస్త్రహీనయయి
రేపు పురమ్మున నేగువేళ, మీ
రామెకు రక్షలై నిలిచి
హానికలుంగగనీక, మానమున్
ప్రేముడి గావరే ముగురు
వేలుపుటమ్మ లుదారనీరధుల్ !!" ౮

రాజితమతి నివ్విధి వని
తాజనములు సురసతుల కుదారహృదయ నా
రాజీవాక్షిన్ గావఁగ
పూజల నొనరించిరంట పురి నింటింటన్. ౯

పశ్చిమాంబుధి భానుండు వ్రాల; అంత—
పాపకల్మషచిత్తసంభరితజగతి
ద్వ్యాగమూర్తులు నా—తమోరాగనిబిడ
మైన దివివెల్గె తారక లచ్చటచట. ౧౦

పురి జనులిట్టులామెకయి
 పొక్కుచు నుండఁగ, నిశ్చలాత్మయై
మరుదివసంపుమాట అణు
 మాత్రము లేక శయించె రాణి! దు
ర్భరతరకష్టముల్ గలుగు
 పట్టులనైన చలింపబోని శాం
తరసనిధుల్ గదా! పరహి
 తప్రతి పాదకులైన సజ్జనుల్! ౧౧

ఱేఁడు స్వీయశంకల నిదురింపలేక,
కన్గవకు గట్టు సతిమూర్తిగాంచలేక,
కాళరాత్రిని వేదనన్ గడపుచుండ,
వెలసె తూరుపుదిక్కున వేగుఁజుక్క. ౧౨

పసిడి నిగారపున్ రుచుల
  ప్రాగ్దిశఁదోఁచు ప్రభాతలక్ష్మికిన్
పొసగిన స్వాగతంబనగ
  పొల్చె వనేందిరపూలువిచ్చి, త
త్కుసుమగుళుచ్ఛవాసనల
  దోఁబుచులాడె ప్రభంజనుండు, సం
తసమున రేగి పాడెను
  పతంగకదంబములంబరంబునన్. ౧౩

అంత మేల్కొని యొక్క నెలంతచేత
అరద మాయత్తపరుపంగ నవనిపతికి
ఆజ్ఞనంపించి పూజాగృహమ్ముదెసకు
శాక్యముని దేవు సేవకై చనెను రాణి ౧౪

తద్దయు నిశ్చలమతి న
మ్ముద్దియ అంజలి ఘటించి, పొల్పుగ నుదుటన్
దిద్దిన కుంకుమరాగం
బద్దినదా బుద్ధదేవు నంఘ్రియుగళిపై: ౧౫

“ ఉరుకారుణ్యామరంద ధార లెద
నుద్ద్యోతిల్లు చందంబునన్ ;
పరగన్ నేటి పరీక్షకున్ నిలుచు ప్రా
బల్యంబు చేకూరగన్ ;
ధరణిన్ సౌఖ్యరసాంబునిర్ఝరులలో
దైవారనశ్రాంతమున్ ;
కరుణన్ నాపతి, నన్ను, నాదు ప్రజలన్
గాపాడు శౌద్ధోదనీ ! ” ౧౬

అంచు ప్రార్థన సల్పి అయ్యనఘమూర్తి
బుద్ధముని దేవు భక్తిమై పూజసల్పి
వెలికివచ్చిన, తనపాదములకు ఫాల
పట్టికను జేర్చి భటుడొకం డిట్టులనియె : ౧౭

"నీ రథమున కీ దినమున
సారథిగాఁ బనిచెనమ్మ క్ష్మాపాలుడు నన్
వారింపరాని నావిధిఁ
గారుణ్యముతోడఁ సైచి కావుము తల్లీ! ౧౮

"నీ పదపద్మమాన! జననీ!
అరదమ్మున నున్న వేళ నీ
వైపిసుమంత యేనియును
వంచిన మూర్ధము తిర్గుచో, రథ
మ్మాపి, శిరమ్ము నీదు పద
మందుఁ బడన్ తెగటారనేసి, త
త్పాపవిముక్తి నంద శప
థమ్మొనరింతును నమ్ముమమ్మరో!" ౧౯

అనిన సమ్మోదబాష్పముల్ కనుల గ్రమ్మ
అతనికిన్ నమస్కృతి జేసి ఆత్మయందు,
సతి, కృతజ్ఞతాభరితవీక్షణల బఱపి
పలికె శాంతంబు దయయు చిప్పిలఁగనిట్లు: ౨౦

"అన్న ! విధ్యుక్తధర్మంబు నన్నిగతుల
పాలనముచేసి యాభగవంతు కృపను
మాకృతజ్ఞతయున్ గొంటి వేకవిధిని
లెమ్ము భయమేల నింక రథమ్ము తెమ్ము !" ౨౧

సారథియు స్యందనంబు తేఁ జనినతోడ
తన్వి యేకాంతమందిరాంతరమునందు,
పతితజనరక్షణోత్సాహభరితహృదయ
యాచు పుట్టంబులన్ విడనాడె ; అంత— ౨౨

సిరిగలదన్న గర్వమునఁ
జేసి నృపాలనృశంసుడిమ్మెయిన్
పరమదయామతిన్ సుగుణ
వార్నిధి నిట్టిపరీక్ష నిల్పగన్
పరగెనటంచు చిత్తమున
పాటిలు కోపము గ్రక్కుచుండెనా
బరగెను తూర్పుకొండ పయి
భానుకుమారు డుదగ్రతేజుఁడై ! ౨౩

ఆ రమణీలలామ మటు
　　లంబరముల్ విడనాడి కోటకున్
చేరవనున్న స్యందనము
　　చేరగవచ్చినవేళ నశ్రువుల్
ధారలుగట్టి పాఱెడు వి
　　ధాన చెమర్చినవంట ఆపగా
తీరమునందు బుద్ధముని
　　దేవు నిమీలితనేత్రపద్మముల్ ! ౨౪

ధర్మసంస్థాపనార్థమా త్యాగమూర్తి
అంబరంబులు లేక నే డరుగు నంచు
కన్నువిప్పగలేదంట కలువకన్నె,
రాజపథపార్శ్వసంస్థితరమ్యసరసి ! ౨౫

మచ్చునకొక పిట్ట మానిసి యేనియు
　　సంచరించెడునట్టి జాడలేక ;
సురుచిరసౌధాల తెరచియుంచిన గవా
　　క్షమొక్కటేనియు గానరాక ;

ప్రాభాతమున గృహప్రాంగణంబుల రంగ
  వల్లులుంచిన యానవాలు లేక ;
విపణివీథుల క్రయవిక్రయవ్యాపార
  సక్తులౌ వణిజుల సద్దు లేక ;
సుందరోద్యానవనములఁ జొక్కి పాడు
శారికాతతి గాననిర్ఝరులు లేక,
అతులశోభాదరిద్రాణ మయ్యె నగర
మట్టులా రాణిస్యందనం బరుగు నపుడు. ౨౬

అలయక చని యటు పురమున
గల వీథులనెల్ల కుతపకాలంబునకున్
కలయఁదిరిగి కోటదెసకు
జలజేక్షణ రథము తిరిగి చనియెడు వేళన్. ౨౭

విసపుఁ దలంపులున్ పయికి
  వెన్నెలలొల్కెడి లేతనవ్వు ; ర
క్కసులకు రాని చేతలును
  గారములూరెడి తేనెపల్కులున్

పౌసగ పురిఁ వసించు నిజ
    ముష్కరకార్యములఁ బ్రసిద్ధుఁడౌ
ముసలి వజీరొకండు, నృప
    ముఖ్యహితుండు, విహారినాముఁడుఁ. ౨౮

కట్టుపుట్టంబులేని యకాంతఁగనెడి
పాపపుంగోర్కె మదిలోన పైకొనంగ,
తలుపునోరగ తెఱచి యాఖలుడు వెనుక
పొంచి సతి రాకకై నిరీక్షించుచుండె ! ౨౯

టకటక తేరిరాక చెవి
    డాసినయంత విహారి వీక్షణో
త్సుకత శరీరమెల్ల కను
    దోయిగనై యటు తొంగిచూచినఁ
బ్రకటతటిద్ధగద్ధగిత
    మైజ్వలియించెడి తేజమొండు త
చ్ఛకటముపీడి యాసచివు
    చక్షుయుగంబును దాకె గుప్పునఁ ! 30

ఆవిలసిత తేజంబటు
లావనితామూర్తినుండి యావిర్భూతం
బై వడి కన్గవఁదాకిన
నావిధిసైపక విహారి అంధుండయ్యెన్ ! 30

గింగురు గింగురంచు చెవికిన్
సహియింపగరాని ఘోషలు
ప్వొంగ, జగమ్ము నొక్కత్రుటి
మూసిన గాఢతమిస్రమందు నే
త్రాంగవిహీనుడై తడుము
లాడుచు, దుర్భరమైన బాధకున్
క్రుంగుచు, అంగలార్చుచును,
కోమలి శక్తికి రిచ్చవోవుచున్ ___ 31

స్యందనంబొండు శీఘ్రమాయత్తపఱచి
లొట్టలొకండ్ల వరదలుకట్టి పాఱు
రక్తదిగ్ధంబులైన వస్త్రములతోడ
నృపునిదరికేగి పదముల కెరగెనతడు. 32

అటుల పదముల్రవాలు విహారి గాంచి
అచ్చెరువునంది కౌగిట గ్రుచ్చియెత్తి
నృపుఁడు మిత్రునవస్థకుఁ హేతువేమొ
తెలియఁగోరిన నాతఁడు పలికెనిట్లు : 38

"పురమున వస్త్రహీనయయి
పోవుసతీమణిఁగాంచు వేడ్కఁకుఁ
మరణముదప్పి లొట్టవడె
నాకు కనుంగవనేఁడు! పోయి యా
పరమపతివ్రతామణి న
పాస్తసమస్తభవౌఘమూర్తినిఁ
శరణమొసంగ వేడుమిక
చాలుపరీక్ష లదృష్టహీనుఁడా ! 39

"కరుణయొకింత లేక, అధి
కారమదంబునఁజేసి మన్ను మి
న్నెఱుగఁగఁబోక, సజ్జనుల
హింసలఁబెట్టుచు నెత్తుటేటిలో

పొరలిన పాప మూరకయ
పోవునె ? భూవరుఁడేని కర్మకుఁ
ధర ఫలమందగావలదె ?
న్యాయము గాంచునె తారతమ్యముల్ ? ౩౬

" నరవర ! మన రాజ్యము, మన
సిరులుఁ సరియౌనె యతివ శీలంబునకుఁ ?
వరలునె ముల్లోకము ల
ప్పరమదయానిధికి కిన్కపైకొనునెడలఁ ? " ౩౭

అనవిని భూవరుండతివ
యద్భుతశక్తికి కంపమందుచుఁ
మనమున మున్నొనర్చిన య
మానుషకృత్యములెల్ల మంటలై
తనువు దహించివైచెడి వి
ధమ్మున గ్రాల సహింపలేక య
వ్వనజదళాక్షి సౌధమును
పర్వున జేరెను ప్రాణభిక్షకై ! ౩౮

చేరి, పురమ్మునఁ దిరిగి
చెచ్చెర పుట్టముదాల్చివచ్చు ఆ
నారి పదమ్ములందు "శరణ" మ్మని
వ్రాలినవేళ, ముత్యముల్
ధారుణి కొల్కిపోయెడి వి
ధమ్మున తోఁచినవంట ఆపగా
తీరమునందు బుద్ధముని
దేవుముఖమ్మున హాసచంద్రికల్ !! ౩౯

"నీదు మాహాత్మ్యముఁ గమనింపలేక
పగర కైనను కారాని బాధలకును
పాలొనర్చిన యట్టి యీ పాపమతిని
సైచి కాపాడు కృపతోడ సదయహృదయ ! ౪౦

"జనులమనంబును, పుణ్యం
బును, నిస్తుల బలయుతుడగు భూపునిక్రౌర్యం
బును సాధించితి శాంతం
బున నీసన్నిధినిక్రుంగి పోయెడి జగముల్ ! ౪౧

"భువి కథినాయకుండనని
   పొంగి, మదమ్మున కన్ను రాక, నూ
నవులను ఖడ్గధార కర
   ణమ్మిడి ప్రేమయటంచు వాగుచున్,
చివురది లేక ప్రోడయిన
   జీవితమేలిన పాపినేను! నన్
భవమున దేలియాడుమని
   బాసెదొ! దివ్యపథమ్ముఁజూపెదో!" ౮౨

అని పదములఁబడి హృదయం
బున పశ్చాత్తప్తుడైన భూవరు నమ్మా
నిని "లె"మ్మని కరుణా వీ
క్షణములఁ బఱపుచుఁబలికెను సాదరమతియై: ౮౩

"నరవర! నిన్ను సైచి శర
   ణమ్మొసగంగల శక్తిమంతుడా
పరమదయాళుడైన భగ
   వంతుడు బుద్ధుడొకండెసుమ్ము! త

చ్చరణ యుగమ్ము భక్తి నని
శమ్ము భజించి, జనాళి నీపయిఁ
గరుణనుగాంచి చేకొను మ
ఖండసుఖప్రదమైన నిర్వృతిఁ !" ౪౪

అంచువచియించి అరదమాయత్తపఱచి
ప్రాణధవుతోడ రాణి యారథమునందు
ఆపగాతీరమందున్న ఆలయమున
శాక్యముని దేవుపూజింప చనెడివేళ ; ౪౫

శుద్ధోధవుండు రాణి శరణమ్ముగోరుట
పురిని బ్రాక, జనులు ముదముతోడ
రథమునందుపోవు రాజదంపతులపై
పూలవాన లొల్కఁబోసిరంట ! ౪౬

అరద మాలయమును జేరినంత డిగ్గి,
తోరమానుఁడు రజనీప్రియారమణియు
బుద్ధదేవుని సన్నిధి మోకరించి,
అంచితంబగుభక్తి స్తుతించిరిట్లు : ౪౭

"ఎక్కడి దీ యజాండముల
 నిట్లు కదల్చెద వింతశక్తి! నీ
దొక్కొకలీల మింటిపయి
 నుజ్జ్వలదీప్తి మనోభిరామమై
యొక్కొక - చుక్కయై వెలుగు
 చుండె! శతాబ్దులఁజీల్చి నేటికిన్
దిక్కులు మారుమ్రోగ నిన
 దించు ప్రభూ! భవదీయబోధనల్! ౫౮

"అవిగో! వెల్లువలై స్రవించెడిని దే
 వా! లోకహింసారతిన్
గవియన్ లేని ప్రపంచ జీవతతిపై
 కారొక్కన్న బాధానల
చ్ఛవిఁ జల్లార్చుచు— ప్రేమరాగరసని
 ష్యందంబులున్, సత్యత
త్త్వవిచారామృతసంభృతంబులు, భవ
 త్కారుణ్య దృగ్జాలముల్!" ౭౯

అని యిటునిశ్చలమతి నా
ఘన గుణవారాశిఁ, భూరికారుణ్యనిధిన్
ముని దేవునిఁగొల్చి పురికి
జనములు కీర్తింపజనిరి సతియున్ పతియున్! ౫౦

*  *  *

ఇలనటుపైని న్యాయముగ
నేలెను హూణనృపాలుడంచు—గ
బ్బిలముల కాలవాలమయి
బీటలు వారిన ఆలయాన, క
న్గొలుకుల నశ్రువుల్ గదుర
కోమలహాసముతోడ నేటికిన్
నిలిచిన బుద్ధుఁజూపి—రజ
నీప్రియ గాథ వచింతుర త్తటిన్!

———